Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102833

★ బ్రిటను-జర్మనీల అసలు యుద్ధమునకు ఉపక్రమణిక ★

# గోలకొండపత్రిక

★ బాల్కన్ వ్యవహారాలలో భాగానికై రష్యావారిఅపేక్ష ★

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ భాద్రపదశు॥ ౧౫ (౧౧-౧౨-౧౩౪౯ ఫ.) సోమవారము సంచిక ౩౭

# ఈజిప్టుపై దండయాత్రకు ఇటలీసేనల ఉద్యమము

## ఈజిప్టు సరిహద్దులో ఇటలీ సేనలు

### సిరియాలో ఆందోళనకరస్థితి

ఇటలీ బ్రిటనులయుద్ధమునకు గూర్చి యీసెప్టంబరు ౯వతేదినుండి ౧౨వతేదివరకు వచ్చినవార్తలలో ముఖ్యమైనది ఈజిప్టుపై దండెత్తుటకు ఇటలీసేనలసంసిద్ధత. లిబియా చుట్టుప్రక్కల ఈజిప్టుసరిహద్దుపొడవునను ఇటలీసేనలు సెప్టంబరు ౧౨వతేదికదిలినవి. ఈజిప్టుపై దండెత్తుటకు ఇటలీ మూడుసేనలను సిద్ధముచేసియుండెను. జర్మనుసేనలు ఇటలీవారి సహాయమునకై వచ్చుటలేదు.

సెప్టంబరు ౯వతేది దక్షిణ ఆఫ్రికాలో బ్రిటిషు పదాతిసైనికులు అబిసీనియాలోకి ౧౨౦ మైళ్లదూరముదనుక, రుదోల్ఫు చెరువుకుతూర్పుగా ౧౭ మైళ్లదనుకచొచ్చుకొనిపోయిరి. అక్కడ ఒకకోటలోనున్న ౪౦ మంది సైనికులతోపోరాడి అనేకులనుగాయపరచి బ్రిటిషువారు తిరిగిపోయిరి. మరికొందరు బ్రిటిషు పదాతిసైనికులు అబిసీనియాలోకి గోరాయివరకుపోయి అక్కడ శత్రుసైనికులకు గాయములుకలిగించితిరిగిపోయిరి. కెన్యాలో బ్రిటిషు పదాతిసేనలు ఉత్తరపు సరిహద్దుజిల్లాలలో మార్సొబిటొకును ముస్సోలిని మధ్య రెండువందలమైళ్లపొడవుగ శత్రుసేనలతో సెప్టంబరు ౧౨వతేది పోరాడెను.

**విమాన దాడులు**

సెప్టంబరు ౪వతేది అబిసీనియా కూబానులమధ్య సరిహద్దులో కెంచెమ్మాపై బ్రిటిషు విమానాలు బాంబులువేసెను. సెప్టంబరు ౯వతేదితూర్పు లిబియాలో ఒకహార్బరులోని విమానాశ్రయాలపైనను, డెర్నా విమానాశ్రయాలపైనను, ఎల్‌గాజాలోను బెంఘాలోను ఏల్‌ట్మనిలోను ఉండేవిమానాలపైనను, టోబ్రకులోను ఎల్‌గుబిలోను, ఎల్‌ఏడంలోను ఉండేసైనికప్రాముఖ్యముగల వస్తువులపైనను, అబిసీనియాలో డెస్సీలోని సైనికభవనాలపైనను, అశ్మారాపైనను ఇరిత్రియాలో సైనికభవనముపైనను, మాసావాలో విమానాశ్రయములపైనను, అస్మారా విమానాశ్రయముపైనను, అదెల్ ఖాదర్ ద్వీపకల్పముపైనను, బ్రిటిషువిమానాలు బాంబులువేసెను. తూర్పులిబియాలో రెండువిమానాలు నాశనమయ్యెను. ఇటలీతో బ్రిటిషువారియుద్ధం ప్రారంభమైనది మొదలు ౨౦౩ ఇటలీవిమానాలు మధ్యప్రాచ్యప్రాంతములో నాశముచేయబడెను. ఈ నాశములో దక్షిణఆఫ్రికావారి విమానదళము, రొడేసియావారి విమానదళము, బ్రిటిషువారి విమానదళము పాలుగలిగియున్నవి. సెప్టంబరు ౧౧ వ తేది తూర్పులిబియా, డెర్నా, బెర్నాహార్బరు, బార్డియాలపైనను సోమాలియా, అస్కినూనాలపై సెప్టంబరు ౯ వ తేదినాడును బ్రిటిషు విమానాలు బాంబులువేసినవి

ఇక ఇటలీవారివిమానాలు ఈ క్రింద తెల్పిన ప్రదేశాలపై దాడులుజరిపెను'

సెప్టంబరు ౬ వతేది సూయెజ్. సెప్టంబరు ౭ వ తేది బుర్రా, మాత్రుహు అనుప్రదేశాలు. సెప్టంబరు ౯ వతేది సిదేబారాని, హైఫానూడార్‌కేపు, సెప్టంబరు ౧౦ వ తేది మాత్రుహు, సూడాన్, ఖార్తూం తెల్‌అవిల్‌లో చాలాయిండ్లు నష్టమయ్యెను. ౧౧౧ మంది చచ్చిరి. ౨౧౪౯ మంది గాయపడిరి.

సెప్టంబరు ౧౧ వతేది మెర్సామాత్రుహుపైనను ౧౦ తేది ఖార్తూంపైనను ఇటలీవిమానాలు బాంబులువేసెను.

ఇపుడు ఇటలీవారివి మూడుసేనలు ఆఫ్రికాలోనున్నవి. ఒకటి ఈజిప్టు సరిహద్దువద్దను, ఇంకొకటి ఈజిప్టుసూడానులమధ్య సరిహద్దువద్దనుఉన్నవి. ఈరెండవసేన తూర్పుకెపుగానైలు ప్రాంతమున హైఫాను చేరదలచియున్నది. దీనికి గ్రాజియానీగారు అధిపతి కొసాలానుండి ఖార్తూంకెపు పశ్చిమముగా ఇంకొకసేనదాడి చేయ సంకల్పించియున్నది.

**సిరియాలో అలజడి**

ఇడియిట్లుండ సిరియాలో ఫ్రెంచివారిసేనలను వెంటనే తొలగించవలెననియు ఇటలీవారికి అక్కడకేంద్రముల నొసగవలెననియు ఇటలీవారు ఫ్రెంచివారితో గావించుకొన్న యుద్ధవిరమణపు ఒడంబడిక షరతులు సరిగా అమలుజరుపబడుచున్నది లేనిది పరిశీలించుచుండుటకై నియోగించిన కమిటీద్వారా ఫ్రెంచిప్రభుత్వము వారిని తొందరపెట్టుచున్నారు. ఇంకొకవైపు ఆఫ్రికాలో భూమధ్యరేఖ ప్రాంతములోనుండు ఫ్రెంచి కాలనీలకు జనరల్ డీగాల్ గారిపక్షమున సైనికాధికారిగా పంపించబడియున్న జనరలు డీలార్మినాట్ గారు సిరియాలోని ఫ్రెంచిసేనలన్నియు జనరల్ డీగాల్ గారి అధిపత్యముక్రింద చేరి మాతృభూమి గౌరవమును కాపాడవలెనని ఒకవిజ్ఞప్తి చేసినారు లార్మినాటుగారు యిదివరలో సిరియాలో గొప్ప సైనికాధికారిగా పనిచేసియుండుటవల్ల తన విజ్ఞప్తినివిని సిరియాలోనిచాల ఫ్రెంచిసేనలు డీగాలుగారి అధిపత్యముక్రిందికిరాగలవని నమ్ముచున్నారు.

## బ్రిటనుపై జర్మనీవిమానాల దాడులు

**బకింగ్‌హాం రాచనగరుపై బాంబులు**

ఈసెప్టంబరు ౯వతేదినుండి ౧౨వతేదివరకు వచ్చినవార్తలలో బ్రిటనుపై జర్మనీ విమానాలదాడులు ఎక్కువగా ప్రధాననగరమగు లండనుపైననే జరిగినట్లుకనబడుచున్నది. లండనునగరములోని చారిత్రిక ప్రసిద్ధనిర్మాణముల నేకములు జర్మను బాంబులచే ధ్వంసముచేయబడుచున్నవి. ఈసారి సార్వభౌముని రాచనగరుఅగు బకింగుహాం భవనముపై బాంబులు రె డురోజులలో వేయబడినవి.

సెప్టంబరు ౯వతేది ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రివేళలలో జర్మను విమానాలు బ్రిటను అన్నిభాగములపైనను సంచరించి బాంబులువేసినవి. కెంటులో చాలయిండ్లుధ్వంసమయ్యెను. ఈ నాటిసాయంకాలము ౕ౫౦ జర్మను విమానాలు దాడిగావించెను. మధ్యాహ్నము లండను నగరమునుచొచ్చుటకు అనేకశత్రువిమానములు యత్నించినపుడు బ్రిటిషువారిపోరాటపువిమానాలకును వాటికినిగొప్ప పోరాటముజరిగెను. లండను నగరమధ్యభాగములో బాంబులుపడినవి, రాత్రి లండనుపై ౩ గంటలకాలముదాడిజరిగెను. ఎవరికిని దెబ్బలు తగులలేదు. లండను తూర్పుభాగములో ౨౨యిండ్లు కూలెను.

సెప్టంబరు ౭వతేదిరాత్రియంతయు లండనుపై దాడిజరుగుచునేయుండెను. అందుచే రైల్లు పనిచేయలేదు. అనేకములైనయిండ్లకప్పులెగిరిపోయెను. చాలాభవనాలు కాలిపోయెను. లండను రేవుప్రాంతంలో అనేకులు యిండ్లకుగోల్పోయిరి ఆస్తికికూడచాలనష్టమయ్యెను. ఒకవార్తాపత్రిక కార్యాలయంవద్ద బాంబుపడెను కాని ఆకార్యాలయోద్యోగులు రక్షణస్థలాలలో ఉండి తప్పించుకొనిరి ౨౦౦ ఏండ్లక్రిందటిచర్చిపాడయ్యెను. ఒకభూగర్భగత రక్షణస్థలముకూడపైనున్న యిల్లుకూలుటచే దురవస్థకుగురికాగా జనులెట్లోతప్పించుకొనిరి. ౯వతేదిఉదయము సార్వభౌములు నష్టపడినజనుల ప్రాంతములనుచూచి దుఃఖించిరి.

సెప్టంబరు ౧౦ వ తేదినాడుకూడ ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము రాత్రియంతయు జర్మనువిమానాలు బ్రిటనుపైదాడిజరిపెను. లండనునగరముపై సాయంకాలమువరకు ౫ సారులును, రాత్రియంతయును బాంబులు వేయబడెను, ఈస్టుఆంగ్లియాసముద్రతీర ప్రాంతములో నాలుగిండ్లుకూలెను. "మాలాటోవురొట్టెముక్క బాంబు" ఒకటిలండనులోపడెను. థేమ్సునదీసముద్రసంగమప్రాంతంలో ఒకపట్టణములో చాలయిండ్లుకూలి అనేకులుమరణించిరి. బకింగుహాం రాజనగరు సమీపంలో ఒకసరస్సువద్ద ప్రేలినబాంబుచే ఆ నగరుయొక్క ఉత్తరపుకిటికీలుపాడయ్యెను. అసరస్సుద్వారముకూడ పాడయ్యెను. ఆబాంబు ప్రేలినసమయములో సార్వభౌముడును, రాణీగారును ఆనగరులోలేరు. వారు విండ్సరుభవనములోనుండిరి. ఈబాంబు ౧౦ వ తేదినాటి రాత్రిదాడిలోపడిన బాంబుగాక అంతకుముందు ఎప్పుడోపడియుండి యింతఆలస్యముగా ప్రేలినబాంబు. రాచనగరు ఈశాన్యభాగముకూడ దెబ్బతినెను.

౧౦వ తేదినాటిరాత్రి లండను మధ్యభాగంలో ఒకఆస్పత్రి పాడయ్యెను.

ఏప్రెలు ౧౧వతేది లండను నగరముపై పగలు నాలుగుసార్లును, రాత్రియంతయు దాడులుజరిగెను. లండను నగర ఆగ్నేయప్రాంతంలో రాజదంపతులు పోవుచుండినపుడు శత్రువిమానాలరాక హెచ్చరికజరుగగా రాజదంపతులు ఒకపోలీసుస్టేషనులోఉండి విమానాలువెళ్లిపోయినతర్వాత తమప్రయాణముసాగించిరి. లండనులో మరల "మొలాటోవు రొట్టెముక్క" బాంబుపడెను. లండను మధ్యభాగములో ఒకచర్చినేలమట్టమయ్యెను. రెండు ఆస్పత్రులు, కొన్ని చిన్నకార్ఖానాలు పాడయ్యెను. ఈరోజుమధ్యాహ్నము ౧౫౦ జర్మను విమానాలతో బ్రిటిషు విమానాలుపోరాడి వాటిని లండనుపైకి రాకుండచేసెను. ఒకఓడపై జర్మనువిమానాలు ౫౦ బాంబులనువేసెను. లండనులో రెండువార్తాపత్రిక కార్యాలయాలపై బాంబులుపడెను.

సెప్టంబరు ౧౨వతేదినాడు రాత్రి బ్రిటనులో అనేక భాగాలపై జర్మను విమానాలదాడులు జరిగెను. లంకాషైరు పట్టణంలో కొన్నియిండ్లుపాడయ్యెను. స్కాట్లెండు తూర్పుతీరంలో ఒకఓడపై బాంబులువేయబడెను. లండనులో ఒకచర్చిపై బాంబుపడెను.

సెప్టంబరు ౧౩వతేది ఉదయము ౬ గంటలనుండి మధ్యాహ్నము ౩ గంటలవరకు లండను నగరముపై మూడు సారులు జర్మను విమానాల దాడులు జరిగెను

ఉదయము బకింగ్ హాం భవనముపై ౫బాంబులుపడి భవనమును కొంత పాడుచేసెను గాని అందులోనుండిన రాజదంపతులు సుఖముగానుండిరి. వీధులపైకూలుచున్న గోడలకు భయపడిన జనులు బకింగుహాం భవనంలోకి రక్షణకైదూరిరి, అభవనముయొక్క దక్షిణభాగంలో రాజాగారి ప్రార్థనమందిరము ధ్వంసమయ్యెను. నగరులో కిటికీలు అనేకములుపగిలెను. రాజనగరు నాను కొనిలేచినమంటలు ఆర్పివేయబడెను. 'సెయింట్ పాల్సుకథీడ్రల్' భవనము సమీపంలో ఆయిదు బాంబులుపడెను అందొకటి ౫౦౦ పౌనుల బరువుగలది, ఇదిప్రేలుచో అభవనము కూలగలదు. బ్రిటిషుపార్లమెంటులోనిదగు లార్డులసభ భవనముపై ఒక విద హాకబాంబుపడెను బ్రిటిషుమంత్రివర్గమువారి రహస్యాలోచనస్థలమగు డౌనింగుస్ట్రీటుపై బాంబులుపడెనుకాని నష్టములేదు. మొత్తముపై ఈదాడిలో జనులనేకులు బాధపడియుందురని భయంగానున్నది.

ఇంతవరకు ఈదాడులలో ఉభయపక్షాలవారి విమానాల నష్టాలు క్రిందిరీతిగానుండెను.

| | | జర్మనీ | బ్రిటిషు |
|---|---|---|---|
| సెప్టంబరు | ౯ | ౫౨ | ౧౩ |
| ,, | ౧౦ | ౩౩ | ౧౩ |
| ,, | ౧౧ | ౭౯ | ౨౪ |
| ,, | ౧౨ | ౫౬ | ... |

ఇక బ్రిటన్‌లో బాంబుదెబ్బలచే జనులకు నష్టాలిట్లున్నవి:—

| | | మరణాలు | గాయాలు |
|---|---|---|---|
| సెప్టంబరు | ౯ | ౨౭౭ | ౧౪౦౦ |
| ,, | ౯ | ౪౦౦ | ౧౪౦౦ |
| ,, | ౧౧ | ౧౬౫ | ౪౨౦ |

## డోవరుపై పెద్దఫిరంగుల దెబ్బలు

ఫ్రాన్సులో సముద్రతీరంలో జర్మనులుస్థాపించిన పెద్ద ఫిరంగులనుండి గుండ్లు ఇంగ్లీషుఛానల్‌మీదుగా బ్రిటను సముద్రతీరంలో డోవరుపై ప్రేల్చబడుచున్నవి— ఈచర్య సెప్టంబరు ౯వతేది సాయంత్రము, ౧౨వతేదిసాయంత్రము జరిగెను. కొందరికి గాయాలయ్యెను.

**క్రొత్తరంగము**

ఇపుడు బ్రిటనుపై దాడినిజరిపించుచు ఫ్రాన్సులోనున్న గోరింగుగారితోను ఫీల్డ్ మార్షల్ వాన్‌బ్రౌచిష్ అను జర్మను సర్వసేనాని చేరినాడు. అందువల్ల బ్రిటనుపై జర్మనులు అసలు గొప్పదాడియత్నము ప్రారంభింతు రనుకొనుచున్నారు,

**ఉర్దూసభ**

హైద్రాబాదు(దక్కన్), ఆగాఖా ఉస్మానియా స్నాతకుల ఉర్దూభాషాసమితివారు నిన్న హైద్రాబాదు జమ్రుదమహల్‌లో అక్బర్యార్ జంగ్ బహద్దరుగారి అధ్యక్షతలో ఉర్దూప్రాముఖ్యత తగ్గుచున్నదనిన్ని బళ్ళలో కచ్చేరీలలో ఉర్దూమాత్రమే ఉండవలెననిన్ని ప్రభుత్వదృష్టికి తెచ్చేనిమిత్తం సభచేయబడినది. ఉర్దూ మాతృభాషగల ప్రముఖులు గొప్పగా ఉపన్యాసాలిచ్చినారు.

**రాంప్రతాపభవన్**

హైదరాబాదు (దక్కన్) ఆగాఖా సుమారు ౧౦ లక్షరూపాయీలు ఖర్చుచేసి కనయ్యాలాల్ రాంప్రతాపజీ అనేవారు హైద్రాబాదునగరములో నాంపల్లిలో మార్వాడీలకై ఒకసత్రాన్ని కట్టించినారు. దాని ప్రవేశోత్సవాన్ని ప్రధానమంత్రిగారు బుధవారమునాడు జరిపినారు.

**ఈజిప్టు ప్రభుత్వప్రతినిధి**

హైదరాబాదు(దక్కన్), ఆగాఖా ఈజిప్టు కాన్సల్ అయిన అహ్మద్ బే ఒబర్ అనువారు హైద్రాబాదుకు విచ్చేసిరి, వారు నాలుగురోజులుందురు. స్టేషనువద్ద వారికి నబి బహద్దరు యార్జంగుగారును ఖాక్సారులును, ప్రభుత్వాధికారులును స్వాగతమిచ్చిరి. ఖాక్సారులు సలామీ ఇచ్చిరి. ప్రతినిధిగారికి నవాబు సాలార్జంగు బహద్దరుగారు విందుచేసిరి. అచ్చటవారు ఈజిప్టురాజైన ఫారూఖు గారు చాలాగట్టిముసల్మానులని తెలిపిరి వివిధ ప్రభుత్వాధికారులతో ప్రీతిగా మాట్లాడిరి. తర్వాత మ, ఘ. వ నిజాం ప్రభువుగారితో కలిసిరి.

**ఉపన్యాసము**

సెప్టంబరు ౧౭వతేది బుధవారము సాయంకాలము ౬గంటలకు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయములో మంత్రశాస్త్రమహిమ అనువిషయమునుగురించి శ్రీ అగ్నిహోత్రశాస్త్రిగారు ఉపన్యసింతురు

డి॥ఇ॥ యస్. అరవముదు అయ్యంగార్ అధ్యక్షతవహింతురు.

**జనరలు ఫ్రాంకోకు జర్మను ప్రభుత్వాహ్వానము**

జర్మను ప్రభుత్వాహ్వానముమీద జెనరలు ఫ్రాంకో గారు త్వరలోనే బర్లిను పోనున్నారని ఒకవార్తవచ్చినది.

జాతీయ గ్రంధములు

| | |
|---|---|
| హైందవ ధర్మవీరులు | ౦-౬-౦ |
| పాథమిక స్వత్వములు | ౦-౫-౦ |
| కమాల్‌పాషా జీవితము (రెండు భాగములు) | ౦-౧౨-౦ |
| ప్రజలు—ప్రభుత్వము | ౦-౬-౦ |
| జొంధు సంస్థానము | ౦-౫-౦ |
| కాంగ్రెసూసంస్థానములు | ౦-౬-౦ |
| సంస్థానసమస్యలు | ౦-౬-౦ |

సభ్యులకు ప్రత్యేకశాల

వార్షికమూల్యము రు ౧-౭-౦లు

దేశోద్ధారక గ్రంధమాల

సికింద్రాబాదు.

డక్కన్ అస్యూరెన్సుకంపెనీ లిమిటెడ్, బెజవాడ.

నైజాము రాష్ట్రమునకంతకు చీఫ్ ఏజెంటుగా శ్రీ వి. రామప్పరెడ్డిగారిని యేర్పాటుచేసినట్లు సంతోషపూర్వకముగా తెలియపర్చడమైనది.

సదరురాష్ట్రములో అర్గనైజర్లు, జిల్లాయేజంట్లు ఖాళీలు కొలదిగామాత్రమే గలవు. సమర్థులైనవారికి సదరు ఉద్యోగములు నిలకడ గలవిగాను ఆదాయకరముగాను ఉండేఅట్లు యేర్పాట్లుచేయబడును.

ఈదిగువ నుదహరించినవారికి దరఖాస్తులు పంపుకొనవచ్చును:—

వి. రామప్ప రెడ్డి,
మునగాల రాజాగారి బంగాళా,
ఫతేసుల్తాన్ లేను,
హైదాబాదు-దక్కన్.

లేక

డక్కన్ అస్యూరెన్సు
కంపెనీ లిమిటెడ్,
హెడ్ ఆఫీసు,
బెజవాడ.

## ఖమ్మంమెట్టు హైస్కూల్ విద్యార్థికి దారుణశిక్ష

(ఓ-వి)

ఖమ్మం, అబాన్ ౮

ఖమ్మంమెట్టు హైస్కూల్ విద్యార్థియగు పలివెల కృష్ణమూర్తి తనస్నేహితునివద్ద ఇంగిలీషు పుస్తకముతీసుకొనియివ్వక, దుర్భాషలాడాడని ఫిర్యాదురాగానే ఉపాధ్యాయుడగు మాల్వీర ఫీదుల్లాఖాన్ గారికి కోపంవచ్చింది. పిరక్లాసుమాస్టరు కొట్టబోయినను విద్యార్థికి శిక్షయివ్వాలె అనుకున్నారట, ౩-౧౦-౪౦ ఉదయం ౧౦ గంటలకు సదరువిద్యార్థిని తనవద్దకి పిలిపించుకొని కెంపు గుంజీళ్ళు సుమారు ౩౦ పిడిగుద్దులుకొట్టి, రూల్‌దండాతీసుకొని తనకోపం అణిగేవరకు కొట్టినారట. పిల్లవాడు దెబ్బలుతట్టుకోలేక క్రిందపడిపోయాడట. అందుపైఅతనిని అచటవదిలి, పగటి అన్నానికి వెళ్లారు.

సాయంత్రము ఇంటివారికి తెలిసి. పాఠశాలకువెళ్లి పిల్లవాడినిచూచి గుండెపగిలారు. హెడ్‌మాస్టరుగారితోచెప్పారు. కాని తనగదిలోనుంచి బయటికైనావచ్చి పిల్లవాడినిచూడలేదు. మరేవిధమైనచర్యతీసుకొనలేదు పిల్లవానికి నీరుత్రాగించుకొని బండిమీదవేసుకొని అనుపత్రికిచికిత్సకై తీసికొని పోయిరి. డాక్టర్‌గారు ఈ దెబ్బలుచూచి ఆశ్చర్యముపొందుటేకాక "చాల ప్రమాదమైనదెబ్బలు" తగిలినవన్నారు.

ఆరాత్రి విద్యార్థులందరూ కలుసుకున్నారు విద్యార్థిని చూచివెళ్లారు. అందరూకలిసి విన్నపపత్రమర్పించుకొన్నారు. "విద్యార్థులందరికీ క్షేమఅవసరం. ఇంటివారికవసరం" అని దబాయించి పిల్లవానిఅన్న గారితో దరఖాస్తుతీసుకొన్నారు. ౕ-౧౦-౪౦ తేదీన పిల్లవాడినిచూచ టకువచ్చారు. చూచారు. కాళ్లుచేతులు వాచివున్నవి, నడిచేటట్టు లేనిస్థితిచూచారు. ఇంటికివెళ్లారు, ఇంతకన్న ఎక్కువచర్య తీసుకొన్నట్లు ఎవరికని పించుటలేదు.

ఈ ఉపాధ్యాయుడు ఖమ్మంజిల్లా జాగీరుదారుగారికొడుకు. మంచిపలుకుబడి గలవారు. వీరికిత బాదులాఅయనా కాదటవీరికిశిక్షలనువిద్యార్థులు తట్టుకోలేకుండవున్నారట, చెప్పకుంటే వినే ప్రభువులేడనీ పైగాచెప్పుకున్నవారలను ఫేల్ చేస్తారనేభయముతో దరఖాస్తులైనా పంపకుండా శిక్షల అనుభవించుచున్నారట. కనుక దయచేసి ఉన్నతాధికారులు ఈఉపాధ్యాయుని ఇచటినుండి తబాదులాచేసి పిల్లలకుగల ప్రమాదస్థితిని తొలగించెదరని నమ్ముచున్నాము.

## చెన్నూరు గజాననమండలి

(ఒకవిలేఖరి)

చెన్నూరు, అబాన్ 3

చెన్నూరుజిల్లా ఆదిలాబాదులో గతపుణ్యదినము జన్మాష్టమినాడు కృష్ణజన్మోత్సవము "గోదావరి వాచనాలయము"లో జరుపబడెను. తన్మూలమున నవయువకులమనస్సు సంతోషభరంగములు పొందెను. సాహుకారులనుండి సర్కారీనౌకర్లనుండి చందాలు ప్రోగుచేయబడెను గణేశ చతుర్థినుండి ప్రతిదినము ఉదయంసాయం కాలములయందు గణేశవిగ్రహమును పూజింపబడుచున్నది. ప్రతిరోజు రాత్రులయందు సుమారు పదిగంటలవరకు భజన జరుగుచున్నది.

ఈసంవత్సరమున గజాననసేవయందు యేమియు కార్యక్రమ మేర్పరుచలేదు. కొన్ని విఘ్నంధములవలన నట్లుచేయవలసివచ్చెను. అవిఘ్నేశ్వరుని కృపయున్నచో రాబోవుసంవత్సర ముత్సవము మరింతయుత్సాహముతో సొంపుగా జరుగగలదు. ఈపుణ్యకార్యమున అతిశ్రద్ధాభక్తులతో తమ మనస్ఫూర్తిగా భగవత్సేవచేయుచు రాత్రింబవళ్లు పనిచేసి తుదకు సుసూత్రముజరుపువారలలో శ్రీ. కల్లూరి మాణిక్యారావుగారు, శ్రీ.రేగళ్ల విశ్వనాథరావుగారు బి. ఏ కార్యదర్శి, శ్రీ.రాంపల్లి వెంకట్రావుగారు సహాయకార్యదర్శిగారు, శ్రీ. రేగళ్ల జగ్గయ్యగారు, శ్రీ. వల్లంభట్ల వెంకటగారు మరువదగనివారు.

## దేవోత్సవములలో హరిజనులు పాల్గొనుట

(స్వ.వి.) మామునూరు సెప్టెంబరు

ఈసంవత్సరం మధిరతాలూకా మామునూరు గ్రామంలో గణపతిఉత్సవము కేవల మొక పౌరాణిక సాంప్రదాయమునవే గాక సంస్కారవాసనగూడా పొందుటము దావహము.

ప్రకృతిదేవత సాక్షాత్కరించునట్లు అమర్చిన పచ్చిపచ్చాకు పందిరులయందు శ్రీగణపతిని ప్రతిష్ఠించి పూజాదికముల గావించిరి. సాయంకాలమున శ్రీమామునూరు రాజేశ్వరరావుగారిఆధిపత్యమున ఖద్దరుధారణము, హరిజనోద్ధరణము గురించి ఉపన్యాసములును, పురాణకాలక్షేపములును జరిగెను. రాత్రివేళ మహావైభవముతో నూరంతయు జాతిమతవిచక్షణలేక భజనాదికములతో దేవోత్సవములో పాల్గొనిరి.

హరిజనుల నాహ్వానించి మేళతాళములతో పాల్గొనవుద్బోధించిన శ్రీమాన్ డాక్టర్ రాఘవాచార్యులుగారికృషి ప్రశంసాపాత్రము.


SAHARA ONLY GENUINE WITH THIS TRADE MARK CHEAP MADE IN U.S.A.

SAHARA CHEAP

5 అణాలకు 10


కొనండి! చదవండి! నేడే సభ్యులుగా చేరండి!


# అణా గ్రంథమాల

ANNA

సుమారు 50 పేజీలుగల ప్రతిపుస్తకమువెల ఒక్క అణామాత్రము.

## 100 పుస్తకములకు చందా 5 రూపాయిలుమాత్రమే

**ఆశయములు:**

ఆంధ్రులందు మాతృభాషాభిమానము కలిగించి ఆంధ్రభాషా ప్రచారము గావించుటయు, తద్వారా ఆంధ్రులందు ప్రపంచజ్ఞానము కలిగించుటయు ముఖ్యముగా ప్రతి ఆంధ్రుడుకొని చదువు అవకాశము కలుగచేయుటకు సాధ్యమైనంతచౌకగా పుస్తకములను అందజేయుటయే మా ముఖ్య ఆశయము.

ఆంధ్రుల నిత్యజీవితమునకు సంబంధించిన పుస్తకములు, మహనీయుల జీవితములు, ధార్మిక, సాంఘిక, కర్షక, కార్మిక, రాజకీయ మొదలగు సమస్యలపై అందరికి అర్థమగు భాషలలో అతిసులభశైలిలో మీదుమిక్కిలి అందరికి అందుబాటులోనుండునట్లు ప్రచురింపబడును.

అణా గ్రంథమాల

**నియమములు:**

శాశ్వత సభ్యత్వము చందా 5-0-0 సభ్యులకు గ్రంథమాల జీవించియున్నన్నిరోజులు పుస్తకములు వచ్చును. కనీసము 100 పుస్తకములువచ్చును. ప్రతి సంవత్సరము 25 పుస్తకములు ప్రకటింపబడును, గ్రామములలో నుండువారు 2-0-0 పోస్టుచార్జి యివ్వవలెను. 6 పుస్తకములు ఒకసారి ప్రచురింపబడును పుస్తకములు అనురిజిస్టరు పార్సిలు ద్వారా పంపబడును. ప్రతిపుస్తకము సుమారు 50 పేజీలు వుండును. సభ్యులుచేరినప్పటినుండి వెలువడుపుస్తకములుమాత్రమే యివ్వబడును ఇదివరకు 1-0-0 యిచ్చి చేరినసభ్యులు శాశ్వత చందాదారులుగా చేరదలచిన 4-0-0 చందామరి 2-0-0 పోస్టుచార్జి యిచ్చిన శాశ్వత చందాదారులుగా చేర్చుకొనబడును.

### రాబోవు పుస్తకములు

ఆంధ్రోద్యమము, మాల్గుజారి పన్నువిధానము, బాధ్యతాయుత ప్రభుత్వము, సోషలీజం, జాగీరుప్రజలు, తెలంగానా ప్రాంతము, భారతము, భాగవతము, రామాయణము, హరిజనులు. వివాహములు, మన విద్యావిధానము, వార్ధావిద్యావిధానము, సంఘదురాచారములు, స్త్రీలసమస్యలు, ఆంధ్రులచరిత్ర, కాంగ్రెసుచరిత్ర, మహారాష్ట్రులచరిత్ర, ఇంగ్లాండు, రష్యా, ఇటలీ, జర్మనీ, జపాన్, చైనా, అమెరికా మొదలగు దేశములచరిత్రలు పరిపాలనావిధానము.

జీవిత చరిత్రలు: కాశీనాథుని నాగేశ్వరరావు, హిట్లరు, ముసులోని, స్టాలిన్, లెనిన్, డివేలెరా, మహాత్మాగాంధి, జవహార్లాల్ నెహ్రూ, సుభాషుచంద్రబోసు, పట్టాభిసీతారామయ్య, బులుసుసాంబమూర్తి, టంగుటూరి ప్రకాశము, యం. యన్. రాయ్, ఆచార్యరంగా, అనిబిసెంటు, మీరాబెన్, విజయలక్ష్మీ పండిత్.

హైద్రాబాదు పరిశ్రమలు, హిందూదేశ సినిమాపరిశ్రమలు, అణామాల డైరీ, 400 పేజీలు. వెల ఒకఅణా, యూరప్ యుద్ధములు. 1914-40.

తక్కిన 50 పుస్తకములు ముఖ్యముగా హైదరాబాదు విషయములపైన ప్రచురించబడును.

## నిజాంరాష్ట్రమున ప్రతిగ్రామములో పుస్తకములు అమ్ముటకు, సభ్యులనుచేర్చుటకు ఏజంట్లు కావలెను. మంచికమీషన్ యివ్వబడును.

వివరములకు—కె.సి. గుప్త, మేనేజరు

3691 త్రూపుబజారు, హైదరాబాదు-దక్కన్.



# 11 గంటలకు

హాయిగాకూర్చొని తేనీరుత్రాగు వేళయినది. ప్రొద్దునచేసినపనికి అలసిపోయిన తేనీరుత్రాగిన అలసట తగ్గును. ఈ చక్కని తేనీరు త్రాగుచు రోజంత ఏమి చేయవలెనో ఆలోచించుకొనుము.

**టీ చేయు క్రమము:**

శుద్ధమైన వేడినీరు. కొంచము వేడి చేసిన శుద్ధమైనపాత్ర. ఒక స్పూన్ టీ యొక్కొక్కరికిన్ని, మొత్తముగానొక స్పూన్ యధికముగాను పాత్రలోవేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిమిషములు తాళి గిన్నెలలోపోసి పాలు చక్కెర చేర్చవలెను.

ఇంకా ఎప్పుడు తేనీరు త్రాగవచ్చునో తెలుసునా

1. తెల్లవారుజామున.
2. మధ్యాహ్నము
3. సాయంకాలము.
4. రాత్రి.

ఎప్పుడైన ఎక్కడైన టీ త్రాగవచ్చును

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిచే ప్రకటింపబడినది IK 119



ఇండియా తేయాకుల్లో శ్రేష్టములు

LIPTONS WHITE LABEL TEA

LIPTON'S

లిప్టన్‌వారి వైట్ లేబిల్, టీగరల్, జాకూటీజాలు



# చెవుడు

"చెవుడు పోగొట్టునది" చెవుడుగాని, చెవిక సంబంధిచిన మరియేజబ్బుయినగాని పోగొట్టునట్టి ఒకగొప్పఅద్భుతమైన ఔషధము. ఎంతకాలమునుండియున్న చెవుడైనను, నిస్సంశయముగా పోవును చెవిటివారు స్వచ్ఛముగావినగలరు. చెవుడుకొంచమైనను, ఎక్కువగానున్నను, పూర్తి చెవుడైనను, లేనిచెవ డైనను, జ్వరమువలనగాని నరముల బలహీనతవలనగాని, గొంతునసవలనగాని ముక్కు మరియు ఇతర అవయవములవల్లగాని కలిగిన చెవుడైనను అనుమానము లేకుండ మానును, చీముకారుటగూడ ఆగును మరియు వినికిడిశక్తి జాగ్రత్తముగనుండును. ఈఔషధముచే వేలకువేలు చెవిటివారు బాగుగా వినగల్గుచున్నారు, ధర రు 5 పోస్టేజి అ 9.

ఏజంట్లు —సయ్యద్ అబ్దుల్ రజాక్ అండుకో-ము.ఘు.వ. నిజాం కెమిస్టులు.

బ్రాంచి: —నాందేడు (దక్కన్).

# గోలకొండపత్రిక.

విక్రమనామసం॥ర భాద్రపద శు॥ ౧౫
సోమవారము


## సాంఘిక శాసనములు

శాస్త్రములుకానీ, శాసనాలు కానీ, బహుజనాభిప్రాయము పైననే ఆధారపడియుండును. ప్రభువులును ఒక్కొక్కసారి బహుజనాభిప్రాయంలేకున్నా శాసనాలు చేయుదురు కొన్ని సమయములలో ప్రజలకు అవి నచ్చకుంటే తిరుగబడుతారు. నచ్చితే ఊరకుంటారు. ఇది ప్రపంచపద్ధతి. అటులకాక ఎన్నడో యుగాంతరములలో కాని వేలకొలది యేండ్లకు పూర్వముకాని కావింపబడిన సాంఘిక శాసనములును, సాంఘిక వ్యవహారములందు శాసించు శాస్త్రములును "దేశకాల నిమిత్తాంతరములలో" అన్నియు పూర్తిగా పనికిరానేరవు. హిందువులందు సుమారు ౨౦౦౦ ఏండ్లకుపూర్వమే శాస్త్రములు వ్రాయుట, ఋషులు, మునులు పుట్టుట, నిలిచిపోయినతర్వాత అయిదారు నూర్లఏండ్లు గడిచేవరకే జనుల ఆచార వ్యవహారములలో భేదాలు వచ్చెను. వాటిని సమన్వయించుటకై కొందరు నిబంధనకారులు బయలుదేరిరి. యాజ్ఞవల్క్యాది స్మృతులపై వ్యాఖ్యానకర్తలు వ్యాఖ్యానవ్యాజముచేత తమ సమకాలీనములైన ఆచారముల నంతు పొందుపరచిరి. ఈయంశము ప్రతి వకీలుకు తెలిసిన విషయమే.

ఇంతేకాదు. మహమ్మదీయులు వచ్చిన తర్వాత ఖాజీల అదాలతులలో హిందూశాస్త్రములకు కొంతకొట్టువడెను. శాస్త్రములలోని శిక్షాస్మృతిమూలబడెను. ఇంగ్లీషువారు వచ్చినతర్వాత హిందూధర్మశాస్త్రములో రూపురేఖలు లేకుండా మార్పులు జరిగెను. హైకోర్టులన్నియు పరస్పర భిన్నముగా తీర్పులు చెప్పెను. అన్నిటికిని పై కచ్చేరీ లండనులో నున్న ప్రీవీకౌన్సిల్ వారిదే తుదిమాట. అటుపై యిక మురాఫాలేదు. కావున ఈనాడు హిందూధర్మశాస్త్రముల ప్రవర్తకులెవరయ్యా అంటే వారు ప్రీవీకౌన్సిల్ సభ్యులు.— మహర్షులు, భిన్నఋషులు, మునులు, ఎవ్వరయ్యాఅంటే లండనులో పీఠము వేసికూర్చున్న శ్వేతర్షులే!

ఇక ధర్మశాస్త్రములో జోక్యం కలిగించుకోవద్దండీ అని ఘోషించుటలో లాభమున్నదా? హైదరాబాదులో కొన్నిపత్రికలధోరణి విచిత్రముగా నున్నది. మేము "ధర్మములో జోక్యం" అను సంపాదకీయమును ౨౯-౭-౪౦ నాడు వ్రాయగా సికింద్రాబాదులో ఒక తెనుగుపత్రికలో ౭-౮-౪౦ నాడు పేరులేని ఒకడు మమ్ముల నోటికి వచ్చినట్లు దూషించెను. అది ముందురానున్న అవిచ్ఛిన్నమగు దూషణపరంపరలకు నాందిగానుండెను. ఆ దూషణలతోపాటు బ్రిటిషుప్రభుత్వాన్ని గూడ దూషించెను ఆ దూషించుటలోను విచిత్ర తర్కముతో దూషించెను. ఎట్లనగా

"ఇంతవరకు ప్రభుత్వమువారు మతవిరుద్ధశాసన ద్వారమున సనాతనధర్మమునందు చేసిన హస్తక్షేపము సహింపదగినదికాదు. ఐనను అట్టి శాసనము లనవరతముండజాలవు. ధర్మఏవ హతోహంతి అన్నట్లు గినికిబడులు ధర్మదేవతయే తీర్చుకోగలుగును. అందుచేతనే ప్రభుత్వము వారు యుద్ధమనెడి ...గినయవస్థలో బడి యల్లాడుచున్నారు."

స్థానిక ఉర్దూపత్రికలలో రెండుమూడింటి ధోరణికూడ యిట్టి విచిత్రంగానున్నది. సనాతన భాయీలపై వారు బాల్యవివాహంవిషయంలో పంచప్రాణా లప్పజెప్పుచున్నారు. అదే సనాతనభాయీలు హరిజనుల వాసన, గాలి, ప్రశంస, సోకనియ్యరు. కాని పైపత్రికలు హరిజనుల కష్టాలను గోరంతలు కొండంతలుగాచేసి వారిపక్షాన ఘాటైన వకాలతు చేయుచునేయుందురు. ఈ పరస్పర విరుద్ధధోరణి యెందుకు? ఇట్లుచేసిన హిందువులలో సంస్కారులకు సనాతనులకు ద్వేషాలు మరింత పెరుగుటలేదా!

మరి యీ బాల్యవివాహనిషేధ శాసనం సనాతనుల అభిప్రాయ ప్రకారం కూడదు. వారి మాటనే విన్నట్లైతే ఇక ఈ రాష్ట్రములో హిందువులకు నిష్కృతిలేదు ఈరాష్ట్రింసంగతి అట్లుండని. కొన్ని దేశీయ హిందూసంస్థానాలలో హిందూశాస్త్రములకు భంగకరమైన శాసనాలెన్నియో ఎన్నోయేండ్లకు ముందు చేయబడెను. ఆ శాసనాలుచేసినందున ఆహిందూసంస్థానాలలో ధర్మం తలక్రిందుకాలేదు. సనాతనులు గడబిడలుచేసి ఆయాసపడలేదు. ప్రశాంతముగా పరిస్థితులు సాగిపోవుచున్నవి. బరోడాసంస్థానం హిందూరాజుచే పరిపాలింపబడుచున్నది. ప్రజలలో నూటికి ౯౦ మందికిపైగా హిందువులే. అచ్చట ౧౯౦౧ నుండి క్రీ. శ. ౧౯౩౬ వరకు ౧౯ సాంఘికశాసనాలు కావింపబడినవి. అవేవనగా వితంతూద్వాహశాసనం (౧౯౦౧) హిందూ వివాహ శాసనం (౧౯౦౫) హిందూ వారసత్వఋణములు (౧౯౦౭) హిందూ వారసత్వము (౧౯౧౦) హిందూ సమిష్టికుటుంబము (౧౯౧౦) హిందూజనకస్వత్వశాసనం(౧౯౧౦) హిందూఆస్తిపాలనం (౧౯౧౦) హిందూ విధవలచట్టం (౧౯౩౧)మతస్వాతంత్ర్యం (౧౯౦౧) బాల్యవివాహ నిరోధశాసనం (౧౯౦౪) హిందూ పూజారులచట్టం (౧౯౧౫) ప్రత్యేక వివాహ శాసనం (౧౯౩౨) కులగౌరవనిర్మూలనశాసనం (౧౯౩౩ సాంఘికనిరోధ నివారణశాసనం (౧౯౩౬) మున్నగునవి.

కాశ్మీరము మరొక దేశసంస్థానం. రాజు హిందువు ప్రజలు నూటికి ౭౦ ...తులు మహమ్మదీయులు ...అచ్చటను బాల్యవివాహనిరోధశాసనమున్ను, వితంతూద్వాహశాసనమున్ను ...క్రిందటి కావింపబడెను

...దూరు మరొక దేశసంస్థానం. ...ప్రజలలో నూటికి ...హిందువులు. ...

టకూడా యీక్రిందిశాసనాలు కావింపబడెను.

(౧) హిందూ వితంతూద్వాహ శాసనం.
(౨) వృద్ధులకు బాలికలకు వివాహ నిషేధించు శాసనము.
(౩) విధవలచట్టం.
(౪) బాల్యవివాహ నిరోధకశాసనం
(౫) వివాహములందు దుబారా వ్యయ నిరోధకశాసనం.
(౬) శ్రాద్ధవ్యయ నిరోధకశాసనము.
(౭) సివిల్ వివాహశాసనం.

తిరువాన్కూరుసంస్థానం మరొక దేశీరాజ్యం. రాజుహిందువు. ప్రజలలో నూటికి ౬౦ హిందువులు, నూటికి ౨౫ క్రైస్తవులు, నూటికి ౭ దు మునల్మానులు. అచ్చట 3 ఏండ్లనాడు హరిజన దేవాలయ ప్రవేశ శాసనము కావింపబడెను.

మైసూరు మరొక దేశీసంస్థానం. రాజు హిందువు. ప్రజలలో బహుళసంఖ్యాకులు హిందువులే. అచ్చట యీ క్రింది శాసనాలు కావింపబడెను. (౧) "స్త్రీల అధికారాలలో మార్పులుచేసి హిందూధర్మశాస్త్రిన్ని మార్పుజేసేశాసనము" అను పెద్దపేరుగల శాసనము ౧౯౩౩ లో కావింపబడెను. ౧౯౩౮ లో హిందూ వితంతూద్వాహ శాసనము కావింపబడెను. ౧౮౯౪ లో అనగా ౪౬ ఏండ్లక్రిందట బాల్య వివాహ నిరోధకశాసనము కావించిరి. అయితే ఆనాటి శాసనములో యీ క్రింది నిర్వచనం చేయబడింది - ౮ ఏండ్లకన్న తక్కువ బాలికలకు పెండ్లిచేయగూడదు ౫౦ ఏండ్లకన్న మించిన పురుషులు ౧౪ ఏండ్లకన్న తక్కువ వయస్సుకల బాలికల పెండ్లాడరాదు. ఇది ౪౬ ఏండ్ల క్రిందటిమాట.

ఈ విధంగా హిందూ రాజులచే పరిపాలింపబడి హిందూజనబాహుళ్యము కల సంస్థానాలలో ఏటేట ఏదోయొక హిందూసంబంధమగు శాసనము కావింపబడుచుండగా హైదరాబాదొక్కటే మధ్యయుగములో (Madaeval age) సంచరించ వలచునా యేమి రాష్ట్రములోని సనాతనులు ప్రియులంతా ఏమి జరుగనున్నదో నిరీక్షించుచున్నారు.

## టికెటులేని ప్రయాణము

రైల్వేవారితో దాలిమూతలు

౧౧ సెప్టంబరునాడు లక్నోలో ఫుట్బాల్ పందెముల ఆట నాడవలెనని ఉత్సాహంకల విద్యార్థులు ౨౦౦మంది కాన్పూరునుండి రైలెక్కినారు కాని అందరు కలబలకుకొని రైలు టికెట్టుకొనకుండా ఎక్కినారు. టికెట్టుఅడిగితే లేదన్నారు. వీరిని కాన్పూరులోపట్టుకొని వసూలుచేయుట కన్ని యేర్పాట్లు చేసుకొనియుండిరి. కాని స్టేషనులో పోలీసువారిని లెక్కపెట్టకుండా తోసుకొని అందరున్నూ తప్పించుకొనిపోయి అపందంగా పందెమునుచూచి మరల రైలుకువచ్చి మరల టికెటులేకుండా రైలునండియెక్కి గంభీరంగా కూర్చున్నారు. ఈతడవ లక్నోకు టెలిఫోనుఇచ్చి పెద్ద పోలీసుగుంపును స్టేషనులోనుంచే ఏర్పాటును రైల్వేవారుచేసినారు. కాని వరల ఏదికూడా వ్యర్థంఅయింది. పిల్లకాయలు పనిపట్టినారు. లక్నోకు ఒకస్టేషను ముందుగానే ఒకరు రైలుడబ్బాలోని గొలుసు లాగినారు విప్రమాదమోఅని రైలుఆగింది తుర్రున విద్యార్థులంతా దబదబదిగి పారిపోయినారు. రైల్వేగార్డు బిక్కమొగంతో కొంతసేపు చూచి రైలుసాగించుకొని వెళ్లిపోయినాడు. లక్నోలో పోలీసువారు రైలుఅధికారులు అందరూ సర్వసిద్ధంగా రైలువచ్చేవరకు విద్యార్థులను పట్టుకొనేదానికి సిద్ధమైనారు. కాని గార్డు నుండిజరిగిన మోసాన్ని తెలుసుకొని వారున్ను తెల్లమొగాలతో యెవరిదారినవారు పోయినారు

## ఉస్మానియా విద్యార్థుల అల్లరి

ని. ఘ. వ. నిజాంగారి ఫర్మాను

అసాధారణ జరీదాలో ప్రకటన

హైదరాబాదు(దక్కన్) అక్టోబరు ౯ ౫ అక్టోబరు ౪౦ నాడు మ.ఘ.వ నిజాంప్రభువుగారు ఉస్మానియా విద్యార్థులుచేసిన అల్లరిని గురించి ఈక్రిందివిధముగా ఫర్మాను వెల్లడించుచున్నారు:—

ఉస్మానియా విద్యార్థులగురించి కొంతకాలమునుండి ప్రకటితమైన వార్తలను, జరుగుచున్న చర్యలను నేనున్నూ నాప్రభుత్వము విచారముతో చూచుచున్నాము. ఎందుకనగా ఇట్టిచర్యలు శాంతిభంగకారణము లగుచున్నవి. ఈపనులనుచేయుటలో ఎన్నో విధానాలున్నవి. న్యాయము సంపాదించుకొనుటకు ఎన్నో మంచిమార్గాలున్నవి. కాని ఇటివిధానాలు అవలంబించకూడదు. ఈవిధానాల మూలముగా నానావిధాల నష్టాలున్న క్లిష్టపరిస్థితులున్ను ఏర్పడుచున్నవి

మొత్తముమీద ప్రభుత్వమువారి అనుమతితో విచారించుట కేర్పాటయినకమిటికి తననివేదికను సమర్పించినతర్వాత ఎట్టి ఏర్పాటు బాగనిపించునో అట్టిదిచేయబడును, తీర్పుకూడా అన్నివిధాలా న్యాయమనిపించునట్లుగా చేయబడును. ఎందుకంటే ఇట్టిసంఘటనములు ముందు జరుగకుండా నిరోధించుట అవసరమనుట స్పష్టము. లేకుంటే ఎప్పటివలెనే విద్యాక్రమము (సిలిలా)నిలిచిపోయి ప్రజాశాంతి భంగకరముగా నుండగలదు. మరియు నారాజ్యముయొక్క ఆచార సంస్కృతులకును మర్యాదకును విరుద్ధముగా నుండగలదు.

కొందరివ్యక్తుల విధానమువలన కమిటీవ్యవహారములో క్లిష్టత కల్పింపబడుచున్నదని తలచుచున్నాను.

అందుచేత ఏకారణాలతో కమిటీఏర్పాటు చేయబడినదో వాటినే దృష్టియందుంచుకొనిసంబంధముగల వర్గములవారందరును సహాయపడవలెను. అట్లుచేసిన వీలైనంతవరకు లోపాలుసవరణకాగలదు: ముందిట్టివి జరుగనేరవు. ఇవి ప్రభుత్వానికి విచారము కలిగించుటయేకాక ప్రజలకును నష్టకారులైయున్నవి. నాయీ ఉపదేశము దృష్టిలో నుంచగలరని నాకు విశ్వాసమున్నది.

శ్రీ ప్రభువుగారి సంతకము.

## విద్యార్థుల హడ్తాల్

(స్వ. వి.)

మహబూబునగరము, అక్టోబరు ౫

మొన్న రాత్రివరకు విద్యాశాఖ నాయబునాజముగారు ఉన్నతపాఠశాల పరిశీలనార్థమైవచ్చిరి నిన్నమధ్యాహ్నము మీరినతర్వాత ౫౦౨ లకు విద్యార్థులందరు వచ్చియుండిరి. మహమ్మదీయ విద్యార్థులందరు బడినుండి వెలుపలికివెళ్ళి అల్లరి చేయుచు గృహోన్ముఖులైరి. కారణములు విచారింప, బడియొక్క గోడలపై శ్రీ ప్రభువుగారి కిరీటముదింపి దానికి బాణము అంటించియుండిరట. మరియు నిందాపూర్వక వచనములు వ్రాయబడియుండెనట,

నాయబునాజంగారు విద్యార్థులకు ఎంతసమ్మతిచెప్పినను వినక వెడలిపోయిరి బజారునంతయు ఊరేగిస్తు ఇతరమతస్థులకు ఉద్రేకముపుట్టించు జయస్వనుల చేస్తు విప్లవగీతములు పాడుచు ౨౫౦విద్యార్థులు ఒక్కటేసారైనుగా వెడలిరి. పోలీసు మొహతెమీముతో వ్రాసినవారెవరో పరిశోధనచేయుటకు మొదలుపెట్టిరి. వీరు చేటికలకు బడికివచ్చుటలేదు. హిందూ విద్యార్థులకు పాఠములు జరుగుటలేదు.

## ఉస్మానియా విద్యార్థుల అల్లరి

హైదరాబాదు అక్టోబరు ౯

పైవిషయములో విచారణకేర్పడిన కమిటీ పంకనుకాలేదు. సర్ వేంకటసుబ్బారావుగారు నాగపూరునుండివచ్చిరి. కాని పనియింకను ప్రారంభముకాలేదు అందుచేత వారు భార్యాయుక్తముగా స్వదేశమగు మద్రాసుకు రెండువారాలకుగాను వెళ్ళినారు. వారు తిరిగివచ్చినతర్వాతి కమిటీవిచారణ ప్రారంభమగునట గుల్బర్గానవాబీదారుగారగు న॥ గౌసుయార్జంగు బహద్దరుగారున్ను కమిటీపనికైవచ్చియుండిరి. సర్ సుబ్బారావు అటుమద్రాసుపోగా యిటునవాబుగారు గుల్బర్గాకు తిరిగిపోయిరి

కళాశాలను తెరుచుట

౧౪ అక్టోబరునాడు కళాశాల పూర్వమువలె విద్యార్థులకు చదువుచెప్పుటకై తెరువబడునని తెలియవచ్చుచున్నది

చక్రవర్తిగారి అభినందనము

హైదరాబాదు(దక్కన్)అక్టోబరు ౬

హిజ్ మెజస్టీ చార్జిచక్రవర్తిగారు లండనునుండి ౩౧ ఆగస్టునాడు మ.ఘ.వ. నిజాంప్రభువుగారిపేర అభినందనతంత్రీవార్త పంపినారు.

హైదరాబాదువిమానదళము(స్క్వాడ్రన్) చేసిన విజయకార్యములగురించి మెచ్చుకొనబడినవి జర్మనుల ౧౮౫ విమానాలను ఈవిమానముకూల్చినని చాలా ఆనందించినారు

## జపాను-చైనా వ్యవహారములు

ఈ సెప్టంబరు ౯వతేదినుండి ౧౧వతేదివరకు వచ్చిన జపాను-చైనా వ్యవహారవార్తలు అనిర్ధారణగానున్నవి. జపానుసేనలు ఇండోచైనా సరిహద్దులో "డీకాడాంగ్"అనుచోటకు రెండుసారులుప్రవేశించినట్లును ఇండోచైనాఅధికారులు వాటిని వెనుకకుపంపిచివేసినట్లును, అందుపై ఇండోచైనాలోగుండా జపానుసేనలను పోనీయవలెనన్నియు, ఇండోచైనాలో జపానుకు విమానాశ్రయములకుచోటును, సముద్రప్రదేశముపై అధికారమును యివ్వవలెననియు జపానువారు ఫ్రెంచిప్రభుత్వమువారికి తెల్పినకోరికలవిషయమై ఇండోచైనా అధికారులకును జపానుప్రతినిధులకును సాగుచుండిన సంభాషణలు భగ్నమైనట్లును కొన్ని వార్తలు తెలుచుండ, మరికొన్ని వార్తలు జపానుకోరికలవిషయమై జపానుప్రభుత్వమువారికిని ఫ్రెంచిప్రభుత్వమువారికిని ఏదోఒక ఒడంబడిక కుదిరినట్లు తెలుపుచున్నవి. ఇండోచైనాకుగవర్నరు జనరలు అయిన వైస్అడ్మిరల్ డీకౌగారికి ఫ్రాన్సుప్రభుత్వమువారు పంపినఆజ్ఞలో జపానుప్రతినిధులతో సంభాషణలు జరిపి సదరు ఆజ్ఞలో తెల్పబడినహద్దులమేరకు ఏమైనను జపానుకోరికలను సంతృప్తిపరచవచ్చునని ఆజ్ఞయివ్వబడినది. డీకౌగారు అంతమాత్రముకూడ జపానుకోరికలను తీర్చనని మొండికివేసియున్నారట.

ఇండోచైనాలో నూటికి ౯౫ మంది ఫ్రెంచిప్రభుత్వమునకు వ్యతిరేకముగా డీగాల్ గారి పక్షములోనున్నట్లును. సైగానులో ప్రజలచే ఎన్నుకొనబడిన సంఘముసభ్యులందరును సెప్టంబరు ౭వతేదినాడు సమావేశమై ఇండోచైనాఅధికారులు జపానుతో ఎట్టిఒడంబడికనుగాని గావించుకొనరాదని తీర్మానించినట్లును ఒకవార్త వచ్చినది.

ఇప్పుడు ఇండోచైనాలో ౧౧౦౦౦ జపానుసేనలు ప్రవేశించినట్లు కొన్నివార్తలు వచ్చినవి. చైనాసేనలుకూడ అనేకములు ఇండోచైనాసరిహద్దులకంపబడినవి

అమెరికావారు తమదేశంనుండి జపానుకు యుద్ధసామగ్రిచేరకుండా మరికొన్ని నిర్బంధాలనుత్వరలో అమలుచేయవచ్చునని వదంతిగానున్నది.

జండాజాత్ర

నిజామాబాదులో జండాజాత్ర ౧౭ సెప్టంబరునుండి ౨౨ వ తేదివరకు జరుగు. దానికి సంబంధించినప్రకటన వేసకొని ప్రకటింపబడినది.

అందుపై నిజాంప్రభువుగారు 3 సెప్టంబరునాడు తమ ఆనందాన్ని తెలుపుచూ శాముచాలా గర్వించుచున్నామనియు తమప్రజలందరును తమ ఆనందములో పాల్గొన్నారని ప్రత్యుత్తర మిచ్చినారు.

## దేశరక్షణ నియమాలక్రింద చర్యలు

సెప్టంబరు ౭వ తేదినుండి జరిగిన అరెస్టులు మున్నగునవి

పంజాబు రాష్ట్రములో లూథియానా నగర కాంగ్రెసు సంఘ కార్యదర్శి గులాంమహమ్మద్ గారు దేశరక్షణ నియమాలక్రింద అరెస్టు చేయబడిరి.

అల్మోరాజిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శి హరిదత్ ఖండ్‌పాల్ మరిముగ్గురు రాంఖేట్ సబ్డివిజను కాంగ్రెసు వారలు అరెస్టు చేయబడిరి.

ఇదేవిధంగా అరెస్టు చేయబడిన లోహాఘాట్ సబ్డివిజను కాంగ్రెసు ప్రచారకుడగు ఠాకూర్ షేర్‌సింఘుగారును, లోహాఘాటు వకీలగు పండిత్ క్రిష్ణచంద్ర జోషిగారును సెప్టంబరు౭వ తేది అల్మోరా జైలులో విచారణకై తేబడిరి. బెంగాలు రాష్ట్రీయ కిసాన్ సంఘ కార్యదర్శి అబ్దుల్ మోమిన్ గారు, ఇదివరలో మీరటు కుట్రకేసు ఖైదీయగు ధరణీగోస్వామి గారు సెప్టంబరు౭వ తేది అరెస్టు చేయబడిరి.

సంయుక్త రాష్ట్రీయ కాంగ్రెసు కార్యసంఘ సభ్యుడగు పండిత రామచంద్రశర్మగారు ఆక్షేపణీయములైన ఉపన్యాసములు చేసినందుకై ఒక సంవత్సరము కఠిన కారాగారవాసశిక్ష విధించబడెను.

సంయుక్త రాష్ట్రపు ఫార్వర్డుబ్లాకు కార్యాలయము, ఆసంఘ కార్యదర్శియిల్లు దాని యిరుగుపొరుగుయిండ్లు సెప్టంబరు ౭వ తేది పోలీసులచే సోదాచేయబడెను. ఆక్షేపణీయమైనదేదియు లభించలేదు.

కిసాన్ నాయకులలో నొకరగు బాబా జవహర్‌సింగుగారికి అమృతసర్ జిల్లా అదనపు మేజిస్ట్రేటుగారు సెప్టంబరు ౬వ తేది రెండేండ్ల కఠిన ఖైదుశిక్షను విధించిరి. కారణము వీరుడు పోయిన జూలై ౨౨వ తేది ... లో ఇచ్చిన ఉపన్యాసము ఆక్షేపణీయమట.

బాబా అలాసింగ్ అను కిసాన్ నాయకుడు ... గ్రామంలో జూలై ౨౫వ తేది ఇచ్చిన ఉపన్యాసములో తప్పుపట్టి అతనికి ఒక సంవత్సరము కఠిన కారాగారవాసశిక్షను విధించినారు.

అఖిలభారత ఫార్వర్డుబ్లాకు కార్యాలయపు కార్యదర్శి ముకుందలాలుగారికి సెప్టంబరు ౬వ తేది ఉదయము కలకత్తానగర పోలీసు ఉపాధ్యక్షులవారు పంపిననోటీసులో ఉపన్యాసము చేయవద్దనియు సభలలో గాని సంఘములలో గాని ఒక సంవత్సరమువరకు పాల్గొనవలదనియు హెచ్చరికగేలదు.

పంజాబు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శి శోధిసింగ్‌దాసు గారిని సెప్టంబరు ౬వ తేది సాయంత్రము లాహోరులో అరెస్టుచేసిరి.

లాహోరు సోషలిస్టు ప్రచారకుడగు పండిత జ్ఞానచందుగారిని యుదెరోజు మధ్యాహ్నము తర్వాత నరెస్టుచేసిరి.

అమృతసరు జిల్లాలోనే ఆజిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షుడగు మలీపసింగ్ శపియాలాగారిని సెప్టంబరు ౬వ తేది అరెస్టుచేసిరి.

కాంపాడ్ జిల్లాలో శివకాశీ సబ్ కలెక్టరు ఆదినారాయణ అను కాంగ్రెసు సోషలిస్టుకు సెప్టంబరు ౯వ తేదినాడు ౬నెలల కఠినఖైదు, ౧౦౦ రూపాయీల జుర్మానా విధించిరి.

శ్రీమతి పంకజమ్మారు అనునామె ఆక్షేపణీయములైన ఉపన్యాసాలను ... పురంలో చేసెనని ఈరోడ్డు మేజిస్ట్రేటు ఆమెకు సెప్టంబరు ౬వ తేది ఒకఏడు కఠినఖైదు ౨౦౦ రూపాయీల జుర్మానా, అది చెల్లించని యెడల నాలుగునెలల కఠినఖైదు విధించెను.

ఇదివరలో అరెస్టుచేయబడి నిర్బంధములో నుండి తప్పించుకొనిపోయిన మాడభూషి వెంకటాచారి, యం. ఏ. గారిని పోలీసులు దొండపాడులో సెప్టంబరు ౮వ తేదిరాత్రి ఏ. నాగేశ్వరరావు గారియింటివద్ద అరెస్టుచేసిరి. ఈవెంకటాచారిగారు బెజవాడ కాలేజిలో అధ్యాపకులుగానుండిరి. వీరిని ౨౪గంటలలోగా బెజవాడ వదలి గుంటూరులో నివాసముండవలెనని గుంటూరుజిల్లాకలెక్టరుగారు ఆజ్ఞాపించియుండిరి.

బొంబాయిరాష్ట్రములో అఖిలభారత కిసాను సభయొక్క తాత్కాలిక ప్రధానకార్యదర్శియగు ఇందులాల్ యాజ్ఞికుగారు బొంబాయి ప్రభుత్వమువారి నిషేధాజ్ఞకు వ్యతిరేకముగా ఉపన్యాసమునిచ్చెనను కారణముచే వారికి సెప్టంబరు ౯వ తేదినాడు ధోల్కాలో మేజిస్ట్రేటుగారు రెండుఏండ్ల కఠిన కారాగారవాసశిక్షను విధించిరి.

### సుభాష్‌చంద్రబోసుగారు

బెంగాలు రాష్ట్రములో శ్రీయుత సుభాష్‌చంద్రబోసుగారు హాల్వెల్ సత్యాగ్రహసందర్భములో అరెస్టుచేయబడి జెయిలులో నుంచబడి యుండిరిగదా. హాల్వెల్ స్మారకచిహ్నమును బెంగాలుప్రభుత్వపు సెక్రెటేరియట్ భవనాలవద్దినుండి తొలగించినతర్వాత సత్యాగ్రహము విరమించబడినతర్వాతకూడ బోసుగారిని విడుదల చేయలేదు. జనులు వారినివిడుదలచేయవలెనని ఆందోళనచేయుచుండిరి, కాని ప్రభుత్వమువారు తొందరపడలేదు. ఇంతలో బోసుగారు బాలీగంజులో దేశప్రియపార్కులో పోయినఫిబ్రవరి ౨౫వ తేదినాడును, బెలిఘట్టములో రాజ్‌బాగాన్ మైదానములో పోయినఫిబ్రవరి ౨౮వ తేదినాడు యిచ్చినఉపన్యాసములు ఆక్షేపణీయములుగా నున్నవని ప్రభుత్వమువారు బోసుగారిపై దేశరక్షణనియమాలక్రింద అభియోగములను ప్రవేశపెట్టింపజేసినారు వీటివిచారణ సెప్టంబరు ౧౦వ తేది అలీపూరు జిల్లా అదనపు మేజిస్ట్రేటుగారివద్ద జరిగెను. మరలసెప్టంబరు ౨౦వ తేది వాయిదా వేయబడినది. ఈ అభియోగమిట్లుండగా బోసుగారిపై ప్రధానరాజధాని మేజిస్ట్రేటుగారివద్ద ఇంకొకఅభియోగము ప్రవేశపెట్టబడియున్నది.

బీహారురాష్ట్రములో రాంపూరు కార్హానా మండల కాంగ్రెసుకమిటీ కార్యదర్శియగు పండిత రామలాలు చతుర్వేదిగారు దేశరక్షణనియమాలక్రిందనే అరెస్టుచేయబడినారు.

సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుసంఘ ప్రధానకార్యదర్శియగు పండిత బాలకృష్ణ శర్మగారికి కాన్పూరు జిల్లామేజిస్ట్రేటుగారు సెప్టంబరు౧౧వ తేదినాడు ౧౮నెలల కఠిన కారాగారవాసశిక్ష విధించిరి. పాలివాల్ గారి అరెస్టుసందర్భములో సత్యాగ్రహమును ప్రకటించుటకు జరిపినసభలో గావించిన ఉపన్యాసమునకై శర్మగారు అరెస్టు చేయబడియుండిరి.

బెంగాలురాష్ట్రములో దేశరక్షణ నియమాలక్రింద సెప్టంబరు౧౧వ తేదివరకు ౪౫౧మంది అరెస్టుచేయబడినారు. వారలలో ౩౧౭మంది యిప్పుడు శిక్షల అనుభవించుచున్నారు. ౮౩మంది ఇష్టమువచ్చినట్లు సంచారముచేయ వీలులేకుండ ఆటంకములు కల్పింపబడినవి ౩౭సభలు, ౫ఊరేగింపులు నిషేధింపబడినవి. ఈసమాచారమును బెంగాలుప్రభుత్వపు మంత్రియగు సర్ నాజిముద్దీను గారు సెప్టంబరు౧౧వ తేదినాడు సాయంత్రము బెంగాలు అసెంబ్లీలో ప్రశ్నోత్తరసమయమున తెలియజేసిరి, ఈవిధముగా అరెస్టుచేయబడినవారిలో ఇంకను విచారణచేయబడని ము...

## సాంకేతిక పదముల సమితి

హైదరాబాదు ఆబాన్ ౯

హిందూస్థాన దేశభాషలలో సైన్సు (విజ్ఞానశాస్త్ర) సంబంధము గల పదాలను ఒక్కొక్కభాషలో ఒక్కొక్కవిధముగా వాడుచున్నారని యు అనెమాచితికావని యు అన్నిభాషలలోను ఒకేపద్ధతిగానుండవలెననియు బొంబాయి పండితులు ఆలోచించి ఒకసమితిని ఏర్పాటు చేసినారు. దానిలో ప్రతిభాషనుండి ఒక్కొక్కపండితుని తీసుకున్నారు, పర్ రామానిమీనన్, జాన్ సర్జంటు, త్రివారి, జియావుద్దీన్ అహ్మదు, అమరనాథఝా, అరంస్ట్రాంగు, అబ్దుల్ హక్, ఫట్నకర్ మున్నగువారు ఇందున్నారు. నవాబు సర్ అక్బర్ నవాజుజంగు బహద్దరుగారు ఈసమితికధ్యక్షులు. వీరి ప్రథమ సమావేశము హైదరాబాదునగరములో అక్టోబరు ౧౫౧౬ తేదీలలో జరుగును.

గురు ఖైదీలు ఆగస్టు ౨౦వ, ౨౧వ తేదులలో ఆహారమును తిననిరాకరించిరి. కారణమడుగగా తమను జైలునియమాల ఉల్లంఘనకై శిక్షించిరి మనిరట ఇప్పుడువారలు భోజనముచేయుచునే యున్నారట.

కాంగ్రెసు ప్రచారకుల్లగు శ్రీమతి బ్రిజ రాణి యిగారు చేసిన ఒక ఉపన్యాసమునకై సెప్టంబరు ౧౧వ తేదినాడు ఢిల్లీలో అరెస్టు చేయబడిరి.

పంజాబు సోషలిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి ముబారకసాగర్ గారు లాహోరునుండి పోవుచుండగా అరెస్టు చేయబడిరి.

బెంగాలురాష్ట్రములో ఢక్కాలో కాంగ్రెసు సంఘముయొక్కయు, విద్యార్థిసంఘముయొక్కయు, కూలీల సంఘములయొక్కయు వ్యవస్థలు చేయుచుండువారలు ౧౫మందికిపైగా నమతమ యిండ్లనుండి కదలరాదనుఆజ్ఞలకు గురియైనారు. ప్రతిరోజు వచ్చిపోలీసు స్టేషనులోకనపడి పోవుచుండవలెననికూడ వారలకాజ్ఞ చేయబడినది.

ఇటీవలనే చిట్టగాంగుజిల్లాలో ఆ కేసులపూర్వపు డిటనూలపై జారీచేయబడియుండిన నిరోధాజ్ఞలు సెప్టంబరు ౧౨వ తేదినాడు ఉపసంహరించుకొనబడినవి

కూలీలసంఘముల వ్యవస్థతో సంబంధముగల లిపిన్ చక్రవర్తి గారిని సెప్టంబరు౧౧వ తేది సాయంకాలము అలిపూరుజిల్లా సెంట్రలుజెయిలునుండి విడుదలచేసినవెంటనే ఒక ఏడాదివరకు ఎక్కడను ఉపన్యాసములొసగరాదనియు, బహిరంగములైన ఊరేగింపులలోగానిసభలలో గాని పాల్గొనకూడదనియునిరోధాజ్ఞనువారికియిచ్చిరి

పంజాబు రాష్ట్ర ప్రధాననగరమగు లాహోరులో కాంగ్రెసు ప్రచారకుడగు హాఫిజ్ సలామతుల్లాగారు పోయిన ఏప్రిలులో ఏదో ఒకసభలో ఆక్షేపణీయమైన పద్యము నొకదానిని చదివినందుకై ఒకఏడు కఠినఖైదు విధించబడిరి.

మద్రాసురాష్ట్రములో మధురలో కాంగ్రెసు సోషలిస్టుఅగు సంగయ్యకు రెండు నేరములకై కలిసి సెప్టంబరు ౨౦వ తేది ఒక సంవత్సరము కఠిన కారాగారవాసశిక్ష విధించబడినది. ఇదేరోజు తెలిచేరిలో పి. యం. పద్మనాభ మారారు అనువానికి ఒక సంవత్సరము కఠినఖైదుశిక్ష విధించబడెను. విరుధునగరపుకూలీలసంఘముయొక్క అధ్యక్షుడగు దురైరెడ్డిగారిని సెప్టంబరు ౧౦వ తేదినాడు అరెస్టుచేసిరి. ఈఅరెస్టు విరుధునగరములో ఇచ్చిన ఉపన్యాసమునకు సంబంధించినది.

మదరాసు రాష్ట్రంలోనే గుంటూరులో డి. కృష్ణమూర్తియను సోషలిస్టుకు విధించబడిన నిర్బంధాజ్ఞను అతిక్రమించినందుకై ఆయనకు సెప్టంబరు ౧౨వ తేదినాడు ఆరునెలలు సాధారణ జైలుశిక్ష విధించబడెను. ఇటీవలనే దండపాడులో అరెస్టు చేయబడిన యం. వెంకటాచారిగారి ని సెప్టంబరు ౧౨వ తేదినాడు జమానత్తుపై ... ఒకటి విడుదలచేసినారు.

జయపూరు (సభాను) లో జమ్నాలాల్ బజాజుగారి సంభాషణ

జయపూరు ప్రజామండలి అధ్యక్షులగు సేఠ్ జమ్నాలాల్ బజాజుగారు సెప్టంబరు౭వ తేదినాడు జయపూరు మహారాజు గారితో ౧౫ని. సేపు సంభాషించి కార్యవర్గమువారు ఇటీవల ఆమోదించిన తీర్మానముల మీద సంస్థానంపట్ల వైఖరి ఎట్టిదియు వివరించిరి.

సెప్టంబరు ౧౦వ తేది లాహోరులో పూర్వము కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ప్రధానకార్యదర్శియగు మున్షీ అహమ్మదు గారికి ౧౮ నెలల కఠినకారాగారవాసశిక్ష విధించబడెను.


తాతావారి
పేసువాసన
తలనూనెతో
మీ వెంట్రుకలకు
సౌందర్యము
చేకూర్చుడు.

తాతావారి
పరిమళ
తల
నూనెలు:-

కొబ్బరినూనె షేంపూ, "జ" సాధక ములు, లైమ్ అండ్ గ్లిసరిన్, తాతా బ్రిలియంటైన్. ప్రతిగొప్ప అంగడిలోను దొరకును ఎల్లప్పుడు దొరుకు స్థలము

టాంకో సేల్స్ డిపార్టుమెంటు
మక్టాన్ ... ,
హైదరాబాదు-దక్కన్

A TATA PRODUCT

తాతావారి ఉత్పత్తి
... కం || ...
బొంబాయి ... బొంబాయి
దయచేసి ... పంపుడు ... ఒక ... పంపుచున్నాను.
పేరు . . . . . . . .
విలాసము . . . . . . .
కీ నెం:- G. P 1


## స్వామీ రామానందతీర్థ

పోలీసులుపట్టుకొనుట

హైదరాబాదు (దక్కన్) ఆబాన్ ౯

భూతపూర్వ హైదరాబాదు సంస్థానకాంగ్రెసుయొక్క భూతపూర్వకార్యదర్శిగారైన రామానంద తీర్థగారిని గురువారంనాడు రాత్రి ౧౦ గంటలకు పోలీసువారుపట్టుకొని (గిరఫ్తారీ చేసి) పోలీసువశంలో ఉంచుకున్నారు.

వీరిని పట్టుకొనుటకుగాను సహాయకొత్వాలగు ముఖ్తారలీఖానుగారున్ను సర్కల్ అయిన జమాగారున్ను అమీనుఅయిన ముష్తాఖలీగారున్ను "కాంగ్రెసుభవనం" వద్దికి రాత్రి ౧౦ గంటలసమయంలో మోటారులో వెళ్ళిరి. అచ్చట రామానందతీర్థ యెక్కడని తలుపుతట్టి విచారించిరి. రామానందగారప్పుడే నిద్రపోవుటకని లోపలికి వెళ్ళి కనులు మూసినారో లేదో ఈపిలుపు వారికివినవచ్చినది.

ఏమిసంగతయ్యా అనివారు బయటికివచ్చినారు. పోలీసుఅధికారులు వారిని అరెస్టుచేయుచున్నామనిచెప్పి వారినిమోటారులో ఎక్కించుకొని వెళ్లిపోయిరి.

ఈ పట్టుకొనుటకుకారణం ఇంకా ప్రకటింపబడలేదు. తీర్థగారు ఒకవారంక్రిందట హైదరాబాదు సంస్థానకాంగ్రెసువారితరఫున అహింసాపద్ధతిపై సత్యాగ్రహం ప్రారంభించనున్నారని ప్రధానమంత్రిగారికి నోటీసు ఇచ్చియుండిరనిన్ని, దానితర్వాత స్టేటుకాంగ్రెసుసభ్యులు ఒక అంతరంగిక సమావేశమునుచేసి అందుసత్యాగ్రహావలంబన విధానమునుగురించి నిర్ణయించినారనిన్ని అందుచేత తీర్థగారిని పట్టుకొన్నారనిన్ని అనుకొనబడుచున్నది.

పైగా రామానందగారు తమపేరుతో పూనాలో ఒకలఘుపుస్తకొన్ని ప్రకటించినారట. అపుస్తకంలో స్టేటుకాంగ్రెసుపక్షాన కాశీనాథరావువైద్యాగారు ప్రభుత్వానికి కాంగ్రెసుపేరు మార్చుదుమని వ్రాసినారనిన్ని, ప్రభుత్వంపక్షాన హోంసెక్రటరీగారగు అజహర్ హుసేన్‌గారు స్టేటుకాంగ్రెసుపేరుమార్చితేదానికిఅనుమతించుతామని వ్రాసినారనిన్ని అవిధముగా పేరుమార్చినతర్వాత ప్రభుత్వమువారు అనుమతి యియ్యకపోయిరనిన్ని ఈ విధమైన ఉత్తరప్రత్యుత్తరాలన్నిటినీ తీర్థగారు ముద్రించినారనిన్ని తెలియుచున్నది. కాని యథార్థమేమో అధికారప్రకటన యింతవరకూ వెలువడలేదు.

... ... ...

## రామానందుగారి అరెస్టు కారణం?

అసోసియేటెడ్ వార్తఒకటి ౧౪ సెప్టంబరు నాటి స్థానికపత్రికలలో ముద్రింపబడినది. అందిట్లున్నది,

౫ ఆబాన్ నాడు రాత్రి రామానందతీర్థగారు పట్టుకొబడినారు, బాబెహుకూమతువారు తమసభలో వారినిపట్టుకొనుటకై నిర్ణయించినారు. వారిని హైదరాబాదు రక్షణశాసనముయొక్క ౨౫వ సూత్రప్రకారం పట్టుకొన్నారు. ఆసూత్రంలో యుద్ధకాలమందు దేశరక్షణ విషయంలోను యుద్ధజయములోను ఆటంకము కలిగించే అట్టుండినవారిని పట్టుకొనినిర్బంధించవచ్చును, అట్టిసూత్రమువీరిపై ప్రయోగింపబడినది ఇదేసరియైనకారణం.తీర్థగారు ప్రధానమంత్రిగారికి ఏదోజాబువ్రాసియుంటారని ఏదో పత్రికలలో వ్రాసినారు. అదిసరికాదు.

మరల ఆజ్ఞాంతరము అయ్యేవరకు తీర్థగారిని జైలులో మూసి యుంచుదురని అనుకొనబడుచున్నది.

## నెహ్రూ గఫారుఖానుగార్లపై నిషేధం

క్వెట్టా, సెప్టెంబరు ౧౨

పండిత జవాహర్‌లాలు నెహ్రూ, ఖాన్ అబ్దుల్ గఫారుఖాను, మహమ్మదుఅష్రఫుగార్లు బెలూచిస్థానమునకు రాకూడదని క్వెట్టాలో ప్రభుత్వాధికారులు బెలూచిస్థానములో "అంజుమన్ వతన్" సంఘముయొక్క అధ్యక్షుడగు అబ్దుస్‌సమద్ ఖానుగారికి తెలియజేసిరి అక్టోబరు ౨౫వ తేదిన ... బెలూచిస్థానములో అంజుమన్ వతన్ సభజరుగును. ఆసభకు నెహ్రూగారు రానున్న ... చేయుటకు అధికారులీయాజ్ఞ చేసిరి


Ba-Ba Water
The Elixir for Infants
మీబిడ్డల సదా ఆరోగ్యమునకు
బాబా వాటర్ [రిజిష్టర్]
ఉపయోగించుడు
సాధారణముగ కలుగువ్యాధులు, విరేచనములు (కడుపు నొప్పి) నమయమున వాంతులు, అజీర్ణము, లివర్ ఉబ్బరము, ప్లీహరోగము మున్నగువాటికి అమోఘముగా పనిచేయును. ... పిల్లల ఆరోగ్యము ...
సర్వ ఔషదదుకాణములలో దొరుకును
బాబా వాటర్
మ్యానుఫేక్చరింగ్ కంపెనీ
ఏజంటు:—జి. రోహిత్ (బ్రదర్స్), సుల్తాన్‌బజారు, హైదరాబాదుదక్కన్.



హె. హె. నిజాంస్టేటురైల్వే

## ప్రకటన

నిజామాబాదులో జండాజాత్రా

16 సెప్టెంబరునుండి 20 సెప్టెంబరువరకు జరుగును

ఎప్పటివలెనే ఎక్కువడబ్బాలు రైలుకు తగిలించబడి నడుపబడును

(ఈజాతర మొదలు 12 నుండి 16 ... గా ప్రకటించి ... కాని యిప్పుడు 16 నుండి 20 సెప్టెంబరువరకు జరుపుట నిర్ణయించబడినది)

## యుద్ధజయప్రార్థనలు

(ఒకవిలేఖరి) మహబూబునగరం ఆగస్టు ౪

నిన్నసాయంకాలము 7 గంటలకు శ్రీమల వాథస్వామి ఆలయములో, మరియు ఇచ్చటిగొప్పగారు జుమ్మామసీదులోను మన చక్రవర్తిగారికి జయముకలుగుగాక అని పరమేశ్వరుని ఇచ్చటి పురజనులు, ఉద్యోగస్థులు ప్రార్థించిరి. కొందరు తప్పక మనకే జయమని చెప్పిరి. దేవుడు మన హిందుస్థానమును రక్షించుగాక అని పలువిధముల ప్రార్థనలు జరిపిరి.

### దేవాలయనిర్మాణము

ఇచ్చటికి 7 మైళ్ళదూరములో అప్పన్నపల్లి అను గ్రామముగలదు. ఆగ్రామమునకు(4) ఫర్లాంగులదూరములో ఒక ఆంజనేయఆలయము జీర్ణావస్థలోనుండెను. శ్రీనరసింహారావు (ఆగ్రామపట్వారి) తనసొంత ద్రవ్యముచే ఆలయమును కట్టించుచున్నారు. విగ్రహము చాలాభీకరముగా యున్నది. ఇచ్చట (౧౨౦) సంవత్సరముల క్రిందట ఒక గ్రామముండెనట. ఇప్పుడు అంతా అరణ్యమయమే. ఆగ్రామము పేరు గిదరపల్లిఅట. అందుచే చీపరపల్లి ఆంజనేయాలయమందురు.

### బాలికా పాఠశాల

ఇచ్చటనున్న బాలికాపాఠశాలనసలు చాలా కష్టముగానున్నది. ఊరిలోనుంచితీసి తిరుమలనాథస్వామి గుట్ట సమీపములో పెట్టియున్నారు బాలికలు వెళ్లుటకు భయపడుచున్నారు, పెద్దబాలికలు వెళ్ళుటలేదు. పంతులమ్మకొరకు బండ్లు ఏర్పడినవి. అబండ్లలో పంతులమ్మలు తమకుకావలసిన బాలికలను ఎక్కించుకొందురు తక్కినబాలికలను బండివెనుక నడిపింతురు. ఉదయము ౧౧ గంటలకు వెళ్ళిన సాయంకాలం ౫ గంటలకువచ్చేవరకు, ఆకలికాని దప్పికాని ఆయినయెడల వచ్చుటకు వీలులేదు. దూరము చాలకలదు, కనుక సర్కారువారు మాబాలికలయందు అనుగ్రహముంచి బండ్లఏర్పాటుకాని లేక పాఠశాలను యథాస్థానమందుంచిన బాగుండునని సర్కారువారిని ప్రార్థించుచున్నాము

### సవారమ్మజాతర

ఇచ్చటి పరిసరగ్రామములలో సవారమ్మజాతరమొదలుపెట్టినారు. ఈ అమ్మగారు ఊరిలో ప్రవేశించినప్పుడే పశువులుసొమ్మసిల్లును. ఏ వారం ప్రవేశించునో ఆదినమునుండి 7 వారములవరకు జాతరసాగును. దీనికి ప్రతివారిల్లు ఒక టెంకాయ ౪ పైసలు తీసుకరావలయునని గ్రామయజమానులశాసనము అమ్మగారి విగ్రహముముందు పోతులను బలియిచ్చుచున్నారు. జాతరపేరుపై గ్రామయజమానులు డబ్బు వసూలుచేసి కొంత అమ్మగారికి కొంత తాముతినుటకు వ్యయపరచుచు బీదలను కష్టపెట్టుచున్నారు. ఈజాతరకు ప్రలిస లైటూరివాడుపోయి అమ్మగారికి మొక్కులు చెల్లించుచున్నారు. కొన్నిగ్రామాలలో అమ్మగారు రకనిజే ...పెద్దమ్మగారై జనులను పీడించుచున్నారు.

## ఆంధ్రయువతీ మండలి

బాల్యవివాహ నిషేధశాసనాను మోదము

హైదరాబాదు (దక్కన్), ఆగస్టు ౪ (ఒకవిలేఖరివలన)

పండిత నరసింగరావుగారి బాల్యవివాహనిరోధకశాసనమునకు ఆమోదమును వెల్లడించుటకు ఆంధ్రయువతీమండలి, పక్షమున హైదరాబాదు నగర కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయంలో ౨ సెప్టెంబరు ఆదివారంనాడు ఒకబహిరంగసభ జరిగింది. ఆంధ్రమహిళా సభాఅధ్యక్షురాలయిన శ్రీ యోగ్యశీలాదేవిగారు బూర్గుల అనంతలక్ష్మిదేవిగారు ఈక్రింది తీర్మానం ప్రవేశపెట్టినారు.

"దాదాపు ౧౫ సంవత్సరాలనుంచీ మన రాష్ట్రంలో జరుగుచున్న ఆందోళనాఫలితంగా శ్రీ నరసింగరావుగారిచే ప్రవేశపెట్టబడిన బాల్యవివాహనిరోధకశాసనమును ఈసభవారు బలపరచుచూ స్త్రీలఆరోగ్య, విద్యావైజ్ఞానికాభివృద్ధులకొరకు ఈశాసనము అత్యంతావసరమని నమ్ముచూ దీనినివెంటనే ఆచరణలోనికి వచ్చునట్లు శాసనముకావింపవలెనని కోరుచున్నారు".

శ్రీ అనంతలక్ష్మిదేవిగారు ఈశాసనంలేకపోవడంవల్ల స్త్రీలకేవిధమైన నష్టం కలుగుతున్నదనీ, దీనిమీద స్త్రీలఅభిప్రాయానికే ఎక్కువవిలువఇవ్వవలెననీ చాలా దీర్ఘంగా మాట్లాడినారు. తరువాత శ్రీ మాడపాటి మాణిక్యమ్మగారు బలపరచుచూ, చాలాఅంకెలు బాలవితంతువులనీ, బాలింతలమరణములనీ, శిశుమరణములనీ, చూపించి ఉద్రేకంతో మాట్లాడినారు తరువాత రాయబర్కతు రాయిసతిగారుకూడ తీర్మానమును బలపరచుచూ ఈశాసనంలేకపోతే ఇప్పట్లోమనవాళ్లు ఈదురాచారం మానివెయ్యరనీ, కనుక తప్పకుండా శాసనంకావలసిందేనని మాట్లాడినారు. వసంతాదేవి బలపరస్తూ బాలికల ఆరోగ్యమూ చదువూ ప్రపంచజ్ఞానము సరిగావుండాలంటే కనీసం ౧౮ ఏండ్లవరకు వివాహంచెయ్యకుండా వుంచవలెనని, ఉపన్యసించినారు, చివరకు సీతాదేవిగారికూడా బలపరస్తూ సృష్టిపుట్టినప్పటినుంచీ ధర్మకార్యాలకు ప్రతికూలాందోళనలు ఉండనే ఉంటుందని మహాపురుషులు జగత్ క్షేమానికి యజ్ఞాలు చేస్తుంటె రాక్షసులు రక్తవర్షం కురిపించడం దగ్గిరనుంచి బ్రిటిషుఇండియాలో సతి, నిరోధానికి, వితంతూవివాహాలకూ స్త్రీవిద్యకూ ఈసనాతనులు ఎట్లునిరర్థకంఆయిన ఆందోళన, చేసినారో వివరింమస్తూ, చివరకు ప్రభుత్వంవారికీశాసనసభ్యులకూ వీరిమాటలు వినేపాలున్నా మనధర్మవర్తనమున్నూ తెలుసుననీ శాసనంగెలుస్తుందనీ, ధర్మమే జయించితీరుతుందనీ మాట్లాడినారు.

అధ్యక్షురాలు శాసనావశ్యకతను గురించిచాలాసేపుమాట్లాడి తీర్మానాన్ని ఏకముఖంగా అందరూ అంగీకారం తెలియచేయవలెననికోరగా సభ్యులందరు కొన్ని నిమిషములవరకూ దీర్ఘమైనకరతాళధ్వనులతో అంగీకరించినారు,

ఆంధ్రమహిళాస్థాయిసంఘంపక్షానకూడ ఇదే సభలో అధ్యక్షురాలయిన యోగ్యశీలాదేవి శాసనం వెంటనే రావలెననికోరుతూ గత ౭వ మహాసభలోకూడాకొన్ని వేలమందిచేత ఆమోదింపబడ్డ ఈశాసనం ఇప్పటికైనా వెంటనే ఆచరణలో పెట్టవలెననికోరుతూ మాట్లాడారు.

## యుద్ధసహాయ సంఘ సభ

(ఒ.వి.) మిర్యాలగూడెం, సెప్టెంబరు ౪.

నేటిసాయంత్రం 7 గంటలకు పెద్ద మైదానములో సెప్టెంబరు ౩వతేది యుద్ధసహాయ కమిటీ అధ్యక్షులవారగు దువ్వం తాలూకాదారు మహమ్మద్ ఇబ్రాహింసాహెబ్ గారి అధిపత్యమున సమావేశమయినసభలో అధికారవర్గము, స్త్రీలు, పురుషులు సుమారు వెయ్యిమందికిపైగా పాల్గొనిరి. వైశ్యయువజనసంఘ సభ్యులు అమితోత్సాహముతో సభాకార్యక్రమములందు పాల్గొనిరి.

## బ్రిటిషు జయానికై ప్రార్థన

నేటిసాయంత్రం 7 గంటలకు స్థానిక శివాలయమున, యుద్ధమునమిత్రమండలివారికి జయముకలుగవలెనందులకై నిజాంరాష్ట్రాంధ్రజన తాలూకా సంఘాధ్యక్షులుగ హైకోర్టువకీల్ కె.రామలక్ష్మయ్యగారి అధిపత్యమున శ్రీ డాక్టరు శ్రీనివాసరావుగారు న్యూకిల్ టీచర్లు, తదితర పురప్రముఖులు, పెక్కుమందిసమావేశమై ప్రార్థనలు జరిపిరి. ప్రార్థనవివరములు డాక్టరు మారేమల్లి వెంకటేశ్వరగుప్తవారు ప్రజలకువిశదపర్చిరి. మసీదులో మహమ్మదీయులు సమావేశమై ప్రార్థనలు జరిపిరి

నూతన రకములబట్టలు కావలెనా? రండి!
ధర భేదమున్నచో వాపసు తీసుకొనబడును
కైలాస వెంకన్నగారి శంకరయ్య
కింగ్స్ వే, సికింద్రాబాదు.

వుసిరికలేహ్యము, చవనప్రాశావలేహ్యము, గులకందు, గులాబు శర్బతులు
శిలాప్రవంగము
(Silapravanga)
అన్నివిధములైన భస్మములు, రసాయనములు, మాత్రలు, చూర్ణములు, ఆసవారిష్టములుకలిగి అందరిచే ఆదరించబడిన కంపెనీ.
శ్రీధూత పాపేశ్వర పన్వేల్ (లిమిటెడ్)
నోటు.-ఒకేసారి తీసుకొనదలచినవారు మాఏజన్సీతీసుకొనదలచినవారు నేడేఆఫీసులోకలుపవచ్చును.
హెడ్డాఫీసు:—హరిపంత్ పన్ లేకర్ దవాఖానా
194 సుల్తాన్ బజారు, మార్కెట్టుసమీపమున, హైదరాబాదు-దక్కన్.
బ్రాంచీలు.—గుజరాత్ జనరల్ స్టోర్, జామ్మామసీదుయెదుట, సికింద్రాబాదు.

అందరూ ఈరోజునుండే
పుచ్చుకొనుట ప్రారంభించండి.
ట్రేడ్ మార్కు
జాండు
ద్రాక్షాసవ
దేహమునకు మెదడునకు
ఉత్సాహమును గలిగించు
రుచ్యమైన ఔషధము.
జాండు ఫార్మావర్క్సు లిమిటెడ్-బొంబాయి
నిజాం ఏజంట్లు:
మెసర్సు, డి. జె. పారేఖ్ అండుకో-సికింద్రాబాదు.

మీబిడ్డలను
ఆరోగ్యముగా
యుంచుటకు
ఇక్
ఫాక్
టోక్
వాడుడు.
★ ★ ★
ఇక్ ఫాక్టోక్
నిజాం...ంగ్ కంపెనీ
హైదరాబాదు-దక్కన్
...అన్నిటియందును
...లభ్యమగును.
Luin & son.

ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ
(లిమిటెడ్)
హెడ్ ఆఫీసు:-మచిలీపట్నము

అత్యల్పమగు రేట్లతో అత్యధికమయిన హామీనిచ్చునది "ఆంధ్ర" మంచిఆర్థికబలంకలిగి వృధావ్యయంకాకుండా అభివృద్ధిని గాంచుచు తగుపాటిదినాదాయం కలవారికీకూడా తమజీవితముల బీమాచేయుటకు అందుబాటులోనున్నది ఆంధ్రభీమాసంస్థయే.

మాయభివృద్ధిని గాంచుడు.

| సంవత్సరము. | | క్రొత్తవ్యాపారం. | ప్రీమియంరాబడి. | భీమానిధి. |
|---|---|---|---|---|
| 1927 | .. | రూ. 6,32,500 | రూ. 44,330 | రూ. 29,000 |
| 1930 | ... | „ 13,73,500 | „ 1,93,000 | „ 2,15,000 |
| 1933 | ... | „ 19,42,000 | „ 2,98,000 | „ 7,16,000 |
| 1935 | ... | „ 27,10,000 | „ 4,60,900 | „ 11,57,000 |
| 1939 | ... | „ 35,29,000 | „ 8,06,500 | „ 26,30,000 |

రూ. 14 లక్షలు సర్కారువారియొద్దను, వారంగీకరించిన సెక్యూరిటీలలోను ఉంచబడినవి. అమలులోనున్న వ్యాపారం: రూ. 1,60,00,000
మీరు బీమాచేయుటయేగాక, మీబంధుమిత్రాదులచే మావద్దభీమాచేయింపుడు.
పలుకుబడిగల ఏజంట్లు నిజాంరాష్ట్రమునందంతటను కావలెను.
వివరములకు వెంటనే క్రిందివారికి వ్రాయుడు.

గాడేపల్లి జగన్నాథం,
చీఫ్ ఏజంట్
కింగ్స్ వే, సికింద్రాబాదు.

తామెప్పుడైన హైదరాబాదునకువేంచేసినచో నాంపల్లి రాయల్ హోటల్ ను మరువకుడు
[ఫోన్ నెం. 3౪౬౭] అచ్చటఉత్తమమైన ఏర్పాట్లుగలవు.
Khan and sons

## బేతాళు సుల్తానుల భేటీ

(౬వ పేజీతరువాయి)

పాసాలుగారు విన్న అమీరుజ్జమాన్‌ఖాను కృష్ణప్రథమభటుని కలిసినారు. ఆతడే అంతగిడ బిడచేసిపోయినాడు. జానెఆలం నవాబుబహద్దరుగారితో మా పాసాలును ఏమిన్ని జోక్యం కలిగించుకోవద్దని చెప్పినాడు, అయినామాగురువు అవారు వి.లేదు. శ్రీనవాబుగారికి పట్టివజిన్నాతును విడిపించవలెనంటే ఈక్రిందివస్తువులు తెంటుకొపంపించేది. ఎల్లుండి జుమ్మా (శుక్రవారం) నాడు మాగురువుఅవారు ఈపదికోరాల సుపరయోగించుచు మంత్రోచ్చాటనకు కూర్చుందురు.

వస్తువులపట్టి:

| | |
|---|---|
| గులాబీఅత్తరు, తెల్లనిది | ౧ సేరు |
| చమేలీ ,, | ౧ ,, |
| లోబాను | ౧। మణుగు |
| తెల్లనికోళ్లు | ౭౨ |
| ,, పొట్టేండ్లు | ౬౨ |
| పట్టుబట్టలు | ౧౬౨థానులు |
| మిఠీని | ౧। మణుము |
| తెల్లనిజవాహిర్ | ౧ వరుస |
| వెండిఇటికెలు | ౧౬౭ |

అన్ని తెల్లనివస్తువులే. జిన్నాతులకు తెలుపే ప్రియం. వీటిని ఈనాడే పంపేది.

ఇట్లు
ముర్తుజా"

నవాబుగారు పట్టీని సరిగా చూడనైనా చూడలేదు. "ఖతేవ్"అని పట్టీపైసంతకముపెట్టి కోశాధిపతికిపంపినాడు. ఖజానాపెద్ద పట్టీనిమాచి తెల్లబోయినాడు. అన్నితేవచ్చునుకాని తెల్లనిగులాబీఅత్తరు ఎక్కడినుండితెచ్చేది. రజావానికి పాలుపడినాడు. "౨౦౦౦ రూ॥ లుపంపు. నేనే తెప్పించిపంపుతాను తక్కువపడితే ఇంకాపైకం తెప్పించుకుంటాను"అన్నాడు, అట్లే౨౦౦౦ రూ॥ పంపబడెను.

పాసాలు మంత్రాలు తంత్రాలుచేస్తూ కూర్చున్నారు. మూడుదినాలైంది. నాల్గవదినం రజాయున్ను నవాబున్ను పాసాలుదర్శనానికి పోయినారు.ఇంకేమున్నది పాసాలుముఖాల్లుకూనింతా మూసుకుపెట్టుకొని మంచంపైపడిఉన్నాడు. నవాబుకు చాలావిచారంకలిగింది.

— రజా—పాసాల్ క్షేమంగాఉన్నారా?

పా— "ఇంకెక్కడిక్షేమమయ్యా జిన్నుల అమీరుడొక్కడేనాని నాపై కోపంవహించి మూడుసార్లుఅడిచిపోయినాడు. నావద్దనుండే ముర్తుజాతిన్నగా పచ్చడంతీసి పాసాలుఒంటిమీదిగాయముల చూపించినాడు."

నవాబు—అకటా అకటా ఇదంతా నామూలాన్నే సంభవించిందికదా, పలిసాలు ఫికరుచేయవద్దు. మంచిపేరైన హకీమునుపంపి బాగుచేయిస్తాను.

ఆదేశప్రకారం హకీమొకచ్చి నగిరం ౨ ప్రసిద్ధహకీమునుపంపి చికిత్సచేయించినాడు. ౧౦ దినాలకు పాసాలుకు బాగైందని వర్తమానంవచ్చింది. నవాబుగారు చాలాఆనందించి హకీముకు ౧౦౦౦ రూపాయిలు ఇనామిచ్చినాడు. మరుసటిపాసాలు ఇప్పుడైనా ఊరకుండగూడదా? మళ్లీ మంత్రప్రయోగాలకు సిద్ధమైనాడు ఈతడవ అమీరుజ్జమాన్నుతును నేనుగాపిలిపించుతానుచూడు నాదెబ్బఅన్నాడు. దానికిన్ని పరికరాలు కావలెను మొదటిపట్టీఅంత మూడంతల సరకులపట్టీవ్రాయించిపంపినాడు. రజా ౨౫౦౦౦ రూపాయిలు ఖజానానుండి తీసుకొనిపోయినాడు. మరల పాసాలు మూడుదినాలు దీక్షతోకూర్చున్నాడు తుదకు విజయంపొందినాడు. జిన్నా సామ్రాట్టు ప్రసన్నుడైనాడు. నవాబుగారికిమూడవ అసెల అమావాశ్యనాడు మధ్యరాత్రి ౧౨ గంటలకు పాసాలుఇంట్లో దర్బారుచేసి దర్శనమిస్తానని పాసాలుకు వాగ్దానమిచ్చినాడు ఈ వార్త నవాబుగారికి తెలియగానే ఆయన ఆనంద సంభ్రమాలలో మునిగిపోయినాడు. వారందినాలకు ముందునుండే సన్నాహాలు ప్రారంభమైనవి. జిన్నా సామ్రాట్టునెట్లు కలుసవలెను. పాదుషా అయినతాను సలామెట్లుపెట్టవలెను. అచ్చుటతన స్థానమెద్ది. ఏమేమిమాట్లాడవలెను. ఆయననుసంతోషపెట్టేమార్గంఏది. ఆయనకు ఏమేమినజరానాలియ్యవలెను ఏమన్నా తక్కువైతే చేసినంత యత్నమంతా వ్యర్థమవుతుందికదా. శ్రీవారొక్కరే అపిశాచనాథునితో కలువవలెనా? లేక ఇంట పరివారాలను తీసుకొనిపోవలెనా? ఇట్టిప్రశ్నా పరంపరలక్రింతా తగిననిర్ణయంచర్చారీ అధికారులతో ఆలోచించి నిర్ణయించుకొన్నాడు. తుదకు నిర్ణయంఅయినదేమంటే ఇదివరలోవలెనే కేవలం రజాయున్ను నవాబున్నుపోవలెను నజరానా నవాబుగారిదర్జాకున్ను పిశాచనాథునిదర్జాకున్ను తగినట్లుగాఉండవలెను. అందుచేత కొన్నిరత్నాలవారాలు, అత్తరు,వాలుగాదునూర్లథానుల పట్టువస్త్రాలు, ఒకఖురాన్ షరీఫ్ ఖల్మి పుస్తకం, పెద్దముత్యాలజపమాల మొత్తానికి ౫౦ వేలకుతక్కువగాని కానుకలు స్వయంగా పసందుచేసి తట్టలలోపెట్టించి తాను ౧౨ ౫౦ టలకు పాసాలుఇంట హాజరైనాడు.

నవాబుగారు జిన్నాదర్బారులో దాఖల్అయినారు. ఆదర్బారు కండ్లుమిరుమిట్లుగొలుపుతూ ఉండింది. గదిఅంతా దీపాలతో జిగజిగా మెరుస్తూఉండి. అత్తరుకువాసన ధూమపొగ నిండిఉండింది. పూలవారాలు కుప్పలుకుప్పలుగా పడిఉన్నవి. జిన్నా సామ్రాట్టు పెద్దసింహాసనముపై కూర్చున్నాడు. భారీమనిషి, మూరెడుగడ్డం, కండ్లపైముక్కుపై నల్లరిబ్బటుమాలపెట్టినాడు. నెత్తిన పగిడీవంటి కిరీటముంది. నవాబుగారికి జిన్నా సామ్రాట్టుగారు స్వాగతమిచ్చినాడు ఉభయ

## సనాతనుల దూషణములు

(శ్రీ గోలకొండ సంపాదకులవారికి వ్రాసిన) ము విజ్ఞాపన:—

నిజాంరాష్ట్ర) ఆంధ్రమహాసభలో చేరెన్ని కగని ౧౫ సంవత్సరాలనుండి అజ్ఞానాంధకారముచే ఆవరింపబడిన ప్రజల హృదయములను ప్రచండజ్ఞానభాస్కర కిరణప్రసారముచేప్రజ్వలితముచేయుచున్న గోలకొండ పత్రికారాజమును ఏనిన్న నేడో పుట్టిన దిక్కుమాలిన "దివ్యవాణి" లో ౧౯—౮—౪౦ తేదీన "జాతీయపత్రికయగు గోలకొండ పక్షపాతము. బాల్యవివాహ నిషేధశాసనము"అనుశీర్షికతో లేనిపోని నిందారోపణలు కల్పించి ప్రకటించినారు. అంతటితో తృప్తినొందక సనాతనధర్మమహాసభాకార్యదర్శిగారు శ్రీనివాస ప్రింటింగువర్క్సు, సికింద్రాబాదునందు కరపత్రములు ముద్రింపించి ప్రజ్ఞాహీనులగు పల్లెటూరి ప్రజలలో పంచుచు పత్రికారాజమునకు విరుద్ధప్రచారమొనరించుచున్నారు. ఇట్టి విరుద్ధప్రచారము గిలకించుకొలది పత్రికారాజాభిమానుల హృదయాంతరాళములను దహించుచున్న దావానలమును పత్రికారాజము ప్రత్యుత్తర వారుణాస్త్ర ప్రయోగముచేపరిసమాప్తమొనరించునని చంద్రచకోరములమాడ్కి నిరీక్షించుచుంటిని కాని ఇంతవరకు ప్రత్యుత్తరముగాంచక తిను దివ్యసన్నిధానమునకు వారి ప్రచురణ కరపత్రమంపుచు పత్రికాముఖమున తగు ప్రత్యుత్తరమొసంగి పరితప్తహృదయుల శాంతిపరచగలరని ప్రార్థించుచున్నాను

ఇట్లు
డి. నారాయణరెడ్డి,
చిక్కనూరు కామారెడ్డితాలూకా.

[ఇనొక్కటేకాదు కరపత్రము ఇంతకుముందును ఇట్టిదూషణలు పత్రికాంతరమున ప్రకటితమై కరపత్రరూపమునకూడ పంచిపెట్టబడినవాటిని మేము చూచినాము. దినమూచచ్చేవారికి ఏడ్చేవారుండరు. దినమూ తిట్టేవారికి మారాడేవారుండరు. వాద బలహీనమైన వాదదుర్బలులు తిట్లకుదిగుదురు. తిట్టువారికి ప్రతిష్ఠ యెక్కవకాదు, దూషితులకీర్తికి కళంకమురాదు. మేము సనాతనులతిట్లకు ప్రత్యుత్తర మిచ్చుకోదలచలేదు. వారికి "బారాఖూన్ మాఫ్" చేసినాము.

గో. ప. సం]

—

హార్మ్యాలలో మోహనాంగులు చామరాలు వీచుచున్నారు. గానము ప్రారంభమైంది జిన్నా సామ్రాట్టుప్రసన్నుడై "ఏంకావాలెఅడుగుఇచ్చినాను"అన్నాడు.

పాసాలు—జానెఆలం మాహుజూర్ బొధునవాబుగారికి ప్రాణదానంచెయ్యండి.

జిన్నా—"ఊం నేనునుకన్నాను. నీవిదేఅడుగుతావని. ఓరాదరెమ్జా! నవాబుసాహెబ్!నీరోగాన్ని నేనుగుర్తించినాను. నీవుచేసినంత అనుభవించుచున్నావు.

నవాబు—నేనేంతప్పుచేసినాను సెలవియ్యండి.

జిన్నా—ఒకసంవత్సరంక్రిందట జోహ్రాపరీ అనేదిమాలోకం భోగాంగన. అదిమీసంగీతాన్ని మోహించి మీదర్బారుకువచ్చి దర్శనంఅడిగితే మీరుపలుకకపోయినారు.

నవాబు—నాకీసంగతి బొత్తిగాజ్ఞాపకంలేదు.ఎట్లుపొరపాటైందోయేమో. అయినా దానికిపరిహారంలేదా"

జిన్నా—ఎందుకులేదు, గోపతినది అవతలితీరానఉండే షహీదుమర్దుయొక్క గోరీవద్దనుండు రాగిచెట్టుపైన పెప్రతిశుక్రవారంఉండును. అచ్చటికి ౫ మాగులు నజరానాపంపించవలెను. ఆమె దాన్ని తీసుకుంటే ప్రసన్నురాలైనట్లు, నిన్ను ఇంక వదలిపోతుందిఅన్నమాట.

నవాబు—ఎంతనజరానా ఇచ్చుకోవాలె:

జిన్నా—సుమారు ఒకలక్షరూపాయిలు ఇచ్చుకోవలెను

నవాబు-చిత్తం- అని సెలవుతీసుకొన్నాడు.

ఈకార్యకలాపాలన్నీ ముగిసేవరకు ౪ నెలలుపట్టినవి ౨ లక్షలకుపైగాఖర్చయినవి.

ఒకనాడు ఆయనప్రియమైనభార్యనవాబుతో ఇట్లన్నది "నాతోడు మీరు కోపపడరు కదా. మిమ్ములనుమోసంచేసి రజాగులాంగాడు మీకేమో దయ్యంపట్టిందనీ దాన్ని వదలించుటకుఏవేవోమంత్రాలు చదువాలెఅనిచెప్పి అంతావాడున్ను మీదర్బారీవారున్ను మిమ్ము క్షౌరంచేసినారు, తెలిసిందా"

నవాబు—"ఛీ ఏంమాట. రజావంటి విశ్వాసపాత్రుడు మరొకడులేడు.

రెండవదినం బోధుసంస్థాన రెసిడెంటుఅయిన మిస్టర్ వర్డ్ అనువారు నవాబుగారినికలిసి యిట్లన్నారు "మీకుపట్టింది దయ్యంకాదు పిశాచంకాదు. మిమ్ముపట్టినవారు రజాయున్ను, కాజనీయున్ను, అబ్దుల్రహిమానున్ను సాదిఖలీమున్ను అయియున్నారు. వారంతాయీవేషాలువేసి మిమ్ము మోసగించినారు.

నవాబు—కాజబనీ, అబ్దుర్రహిమాన్ సెలవుపైన చాలాకాలం ఉండిరి.

రెసిడెంటు—ఈవేషాలువేసేదానికే సెలవుతీసుకొన్నారు. వారితోనీరజాగులాంకూడా కలిసినాడు

నవాబుగారికిరెసిడెంటుగారిపైనకోపంవచ్చింది.తాను నమ్మినవాడు ద్రోహిఅట, తానుమూర్ఖుడట. ఇదేకదా రెసిడెంటుమాటల అర్థము.

మరునాడు మొత్తంనగరవాసులంతా తనస్వతంత్రసామర్థ్యాన్ని బాగాచూపవలెననే అభిప్రాయంతో నాలుగుగుర్రాల బగ్గీలో రజాగులామునుతనప్రక్కనే కూర్చోబెట్టుకొని బోధ్ నవాబుగారు వాహ్యాళివెళ్లినారు.

— —

Life Assurance is the only means whereby one can, by easy periodical payments, provide with certainty, an amount one considers sufficient to ensure FINANCIAL INDEPENDENCE for oneself in one's old age and/or for one's dependents.

Every Year thousands of discerning persons lay the Fondudation Stone of ECONOMIC INDEPENDENCE for themselves in their old age and/or for their dependents after them by insuring their lives with

"The Oriental"

the strongest and most popular Indian Life Assurance Company.

DO NOT DELAY

Take out an "ORIENTAL" Policy Today.

*Write for Particulars to*

D.D. Mehata Esq.,
Acting Branch Secretary
Oriental Life Office,
Maharashtra Girl's Educatio.
Society Buildings,
Laxmi Road, POONA CITY

N C. Varma Esq., M. A.
Inspector
923. Gulbag
Abid Road
Hyderabad-Dn

Other cash collecting arrangements in the Dominions—
Secunderabad & Nanded—Imperial Bank of India.
Warangal, Aurangabad, Jalna-Central Bank of India, Ltd,

"ORIENTAL"

Govt. Security Life Assurance Co., Ltd
Established:-1874. Head Office: Bombay.
Manager:-H EDWIN JONES F. A., A. I. A.

అకాల వార్ధక్యము వలన కలిగిన విచారమును పోగొట్టుడు

జిన్‌సిన్‌గోల్డ్ టానిక్‌పిల్స్

యీమాత్రలు ప్రపంచమందలి మిక్కిలి గుణముగల్గిన వృష్యధాతువులుగల్గి త్వరలో యౌవనోత్సాహమును కలించి, వివాహ జీవితసుఖమును అసమానముగా పొందజేయును. ఆకలిమందగించుట, జ్ఞాపకశక్తి తగ్గుట, నరములబలహీనత, శుక్లనష్టము, నిద్రలేమి, నరములులాగుట, మరియు సర్వదావిచారముతో క్రుంగియుండుట అదృశ్యమై, వీర్యమును వృద్ధిపరచి ఉత్సాహవంతులుగను, బలవంతులుగను చేయును. తరువాత సంతానసౌభాగ్యము కలిగి, జీవిత సౌఖ్యమును పునరుద్ధరింపచేయును.

40 సంవత్సరముల వయసు దాటినవారికిని, అకాలవార్ధక్యమును పొందినవారికి చాల ఉపయోగకరము.

జిన్సిన్ మాత్రలు నూటకినూరు సరియైన బంగారువరఖుతో కప్పబడియుండును.

జిన్సిన్ వాడి ఆనందమయ జీవితమునకు దారితీయుడు.

ఒక సీసా వెల రు 4/- పోస్టేజి 8 అణాలు ప్రత్యేకము. 2 సీసాల వెల రు 8/- పోస్టేజి ఉచితము

వివరింపబడిన ధరలప్రకారము మాఅమ్మకపు ఏజంట్లవద్ద దొరకును.

డి. జె. ఫారెక్ అండుకో, సికిందరాబాదు హైదరాబాదు

ఉచితము! శరీరఆరోగ్యము, అవయవములకు సంబంధించిన మా 44 పేజీల బొమ్మల క్యాటలాగు కోటకు యీ క్రిందివారికి వ్రాసిన యింగ్లీషులో కానీ లేక తెలుగుభాషలలో నైనను పంపబడును.

చైనీస్ మెడికల్ స్టోర్ (స్థాపితము 1930)

28 ఎపోలో స్ట్రీట్, ఫోర్టు, బొంబాయి

బ్రాంచీలు:— అహమ్మదాబాదు, ఢిల్లి- కలకత్తా

అఖిలభారత కాంగ్రెసునందును యితర ప్రదర్శనములందును అనేకములైన బంగారు, వెండిపతకములు, యోగ్యతాపత్రములు పొందినది

(100 సంవత్సరముల జయము)

డా॥ వాషర్ గోపాల్
వైద్యుల
సార్సపర్లిలా

వేలకొలదిమంది యిది మంచి రక్తశుద్ధి ద్రావకమని నిరూపించినారు.

ఇది రక్తమును శుద్ధిచేయుటయేగాక వృద్ధిపరచును. శరీరముపైనుండు నల్లనిమచ్చలను పోగొట్టును. చెడురక్తమువలన గల్గుబలహీనత, బద్ధకము, కంప్లైజబ్బు, కాళ్లుచేతులు వాపు మొదలగు ట్లుటిలోను, వాతమునందును బాగుగా పనిచేయును.

వెల రు 1-4-0 పోస్టుఖర్చులు వేరు.

ఏజంటు: యం. డి. దత్తాత్రేయ అండ్ కో,
సుల్తాన్‌బజారు, రెసిడెన్సీరోడ్, హైదరాబాదు,-దక్కన్

## సీ. ఆర్. రెడ్డిగారి

షష్టిపూర్తినిధి

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి షష్టిపూర్తి జ్ఞాపకార్థమై వారిశిలావిగ్రహమును స్థాపించునిమిత్తమై యిదివరలో ౩౭౨౫ రూ॥ చందాలు వసూలైయుండెను. ఇప్పుడు ౨౧౦౧ రూ॥ చందాలు ఎక్కువగావసూలైనవి. సర్ రామన్ గారు మరల ౨౦౦ రూ॥ సర్ సీ-పీ- గారు ౧౫౭, రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు ౧౦౦, సర్ ఆల్లాడిగారు ౨౫ యీవిధంగా యితరులున్ను ఇచ్చినారు. మొత్తము ౬౦౬౨ రూపాయిలు వసూలైనవి.

— —

# అసలు హంతకులు చిక్కనందుకు విచారమైనాలేని ప్రధాని

## నిరాధారముగ మధ్యరాష్ట్ర కాంగ్రెసు మంత్రివర్గముపై దూషణ

## బెంగాలు ప్రధానికి గాంధిమహాత్ముని సమాధానము

సెప్టెంబరు ౧౫ తేదినాటి "హరిజన్" పత్రికలో విశ్వాకేసు సందర్భమున బెంగాలుప్రధాని ఫజ్లుల్‌హక్ గారు గావించిన ఆరోపణలకు గాంధిమహాత్ముడు సమాధానమీ క్రిందివిధముగా వ్రాసిరి:—

"భారతదేశములో అన్ని రాష్ట్రములలోను బెంగాలు రాష్ట్రము మిక్కిలి పెద్దది. మౌల్వీసాహెబు ఫజ్లుల్‌హక్కుగారిప్పుడు ఆరాష్ట్రములో ప్రధానమంత్రిగానున్నారు. వీరు పూర్వము భారత కాంగ్రెసులో సభ్యులుగానుండిరి. కాంగ్రెసుమీద అత్యధికమైన అభిమానము ... వీరు చూపించుచుండిరి. ఇప్పుడు వీరు కాంగ్రెసుపై దేశీయుల కందరికిని అత్యధికమైక నిరసనభావమును కలిగించగోరి, నన్నుగూర్చి బహిరంగలేఖ నొకదానిని పత్రికలో ప్రకటించినారు.

ముసల్మానులకు మనస్తాపమును అవమానమును కలిగించుటకు యేయేపనులను చేయవలెనో వాటినన్నిటినికూడ కాంగ్రెసువారు చేసినట్లును, దేశములో యితర అల్పసంఖ్యాక సంఘములకుకూడ కాంగ్రెసుపరిపాలనవారులు చాలసారులు అధికమైన అన్యాయమును కలుగజేసినట్లును, కాంగ్రెసుమంత్రులు చేసినఅన్యాయములను యెప్పటికప్పుడు తాను పత్రికలలో ప్రకటించుచుండినను చాలసారులు నాసహకారముతోను నాఆమోదముతోను కాంగ్రెసుమంత్రులిటువంటి అన్యాయములను చేసినట్లును దేశములో పెక్కులక్షలమంది ముసల్మానులకును యితరులకును కాంగ్రెసుమంత్రులవల్ల అత్యధికమైన అన్యాయము జరిగినను, కాంగ్రెసువారి ప్రజాపాలన రథచక్రములు నిర్ఘాతముగా సంచరించుటను మౌల్వీసాహెబుగారు ఆలేఖలో వ్రాసియున్నారు.

నా సహకారముతోను నాఆమోదముతోను కాంగ్రెసుమంత్రులు అన్యాయము చేసిరనిహక్కుగారు నామీద నిందమోపినారు. ఈవిషయములో నేను నిర్దోషినని చెప్పుచున్నాను. కాంగ్రెసువారివల్ల యెవరికైనను అన్యాయము జరిగినట్లు నాకు తెలుపబడినప్రతిదోషములోను నేను విచారించియున్నాను. కాంగ్రెసువారుచేసినపని సరియైనది కాదనునమ్మకము నాకు కలిగినప్పుడెల్ల నేను బహిరంగముగా కాంగ్రెసువారిచర్యను నిరసించుచు చేయుచున్నాను.

విశ్వాహత్య అభియోగములో యివ్వబడినతీర్పులవల్ల నిర్దోషులైన ముసల్మానులకు దారుణశిక్షలు విధింపబడినవని హక్కుగారీవ్యాసములో వ్రాసినారు. దీనినిగూర్చి అభిప్రాయము తెలుపవలసినదని నన్నుకోరినారు. పోయిన సెల గరవతేదిని వెలువడిన "హరిజన్" పత్రికలో దీనినిగురించి నేనువ్రాసినవ్యాసము ప్రకటింపబడియున్నది దానిని హక్ గారు చదివినచో నన్నీప్రశ్న నడిగియుండరు. దానిలో నేను వెల్లడించిన భావములన్నియు ఇప్పుడుకూడ నాకున్నవి. మధ్యరాష్ట్రములలో కాంగ్రెసుమంత్రుల కధికమైన పలుకుబడియున్నది కాబట్టి న్యాయస్థానములోకూడ ముసల్మానులకు దారుణమైన అన్యాయము జరిగినదని హక్ గారు వ్రాసిరి. ఈకేసులో పోలీసువారును, ఫిర్యాదులును అక్రమముగా ప్రవర్తించియుండినచో అందుకు కాంగ్రెసుమంత్రులే విధముగాను బాధ్యులుకారు. ఇట్లు న్యాయస్థానాలలో అనేకసారులు ఇండియాలోను ఇతరదేశాలలోను కూడా అన్యాయము జరుగుచునే యుండును. అందుకు పోలీసువారిపై నిందమోపుదురు. కాని ప్రభుత్వమువారిమీద యెవరును నిందమోపరు. ప్రబలమైన నిదర్శనము కనబడినగాని ప్రభుత్వముపై నిందమోపగూడదు. అక్రమముగా ఫిర్యాదులు చేయునట్లు ప్రభుత్వము వారు ప్రోత్సాహపరచిరని తగిన నిదర్శనములను హక్ గారు చూపించియుండలేదు.

మధ్యరాష్ట్రల లెజిస్లేటివు అసెంబ్లీలో ప్రధానమంత్రి పండిత శుక్లాగారుచేసిన వుపన్యాసములో కొన్నిమాటలనుగురించి కోర్టువారు కొన్ని అభిప్రాయములను చేసినారని హక్ గారు వ్రాసినారు. అటువంటిమాటలను "శుక్లాగారనుటవల్ల కేసులో నిందితులకు అన్యాయముజరుగుటకు అవకాశమున్నదిగనుక అట్టిమాటలను చెప్పుట రాజకీయముగా అనుచితమని కోర్టువారని యుండవచ్చునేగాని పోలీసువారితోను ఫిర్యాదులతోను శుక్లాగారికి సంబంధమున్నదని కోర్టువారు చెప్పియుండలేదు అదియుగాకుండ కోర్టువారాలాగు అనుటవల్ల వారిరిమార్కులకు న్యాయశాస్త్రపు విలువ కలుగదు. అసెంబ్లీలో చేసిన ఉపన్యాసమునుగురించి సమాధానము చెప్పవలసినదని కోర్టువారు శుక్లాగారిని కోరియుండలేదు. అట్లకోరకుండ కోర్టువారు ఇటువంటి రిమార్కులను చేయుట ఉచితముకాదేమో అనికూడ నేను తలచుచున్నాను. దీనినిగురించి భారతకాంగ్రెసు మహాసభాధ్యక్షునకు శుక్లాగారువ్రాసిన వుత్తరములో అసెంబ్లీలో తన వుపన్యాసమునుగురించిన సమాధానము సంపూర్తిగావున్నది. "జగదేవరావును యెవరో హత్యచేసిరనియు చాలమందికి బలమైన గాయములుకూడ తగిలినవనియు కాని నేరముచేసినవారు శిక్షింపబడకుండ తప్పించుకొని పోగలిగినందుకు తాముచాల విచారించుచున్నామనియు అపీలుకోర్టువారు తమతీర్పులో వ్రాసినారు. ఇటువంటి గొప్పనేరముచేసినవారికి శిక్షపడకుండపోవుట శోచనీయమేగాని యిందులకు ముసల్మానులు కాంగ్రెసుమంత్రులమీద నిందమోపుట న్యాయముకాదు. ఈకేసులో అన్యాయము నిజముగా హిందువులకే జరిగినదికాని ముసల్మానులకు జరుగలేదు. హిందువులమీద పోలీసువారు కేసుచేయలేదు, ముసల్మానులలో యెవరికిని బలమైన గాయములు తగులలేదు సాక్ష్యముయొక్క విలువనునిర్ణయించుటలో జిల్లాజడ్జి పొరపాటుపడియుండవచ్చును. ముసల్మానులలో అరుగురికి జడ్జిగారు మరణశిక్షవిధించిరి. దీనినిగురించి ఉచితజ్ఞులందరును బాగుగా ఆలోచించవలసియేయుండును. మరణదండన విధింపబడినవ్యక్తులు నేరము చేసియుండకపోయినను ముసల్మానులలో మరికొందరు నేరముచేసియే వుండవలెను. ముసల్మానులు కొందరు ఒక హిందూనాయకుని చంపినారు. మరి చాలమంది హిందువులకు బలమైన గాయములను కలుగజేసిరి. ఇటువంటి దారుణకృత్యములను సలిపినవారు తమకు శిక్షవిధించకుండ తప్పించుకొనిపోయిరి. ఇందుకు హక్కుగారేమియు విచారమును వెల్లడించలేదు. తనతోడి ప్రధానమంత్రియైన శుక్లాగారిమీద యిటువంటినిందను మోపుటకు ముందుగా హక్కుగారు శుక్లాగారికివ్రాసి తెలుసుకొని వుండిన మర్యాదగావుండేది.

* * *

**జగదేవరావు పటేలు హత్యకేసు వివరాలు**

మధ్యరాష్ట్రములలో చిక్కా, అనే గ్రామములో ౧౯౩౮ సం॥ ... తేదీన హిందువులకును ముసల్మానులకును కొట్లాటజరిగెను. అందులో జగదేవరావుపటేలు అను కాంగ్రెసునాయకుని ముసల్మానులు చంపిరి! చాలమంది హిందువులకు బలమయిన గాయములుతగిలెను. పోలీసువారు ౪౦ మందిమీద కేసుచేసిరి జిల్లాజడ్జిగారు ౧౨ గురిని వదలి, ౬ గురికి మరణశిక్ష వేసిరి. ౨౨ మందికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధించిరి, శిక్షితులు నాగపూరు హైకోర్టులో అప్పీలు చేయగా ౩౧ మందిని విడుదల చేయవలసినదనియు వారిమీద నేరము రుజువుకాలేదనియు హైకోర్టువారు తీర్పుచెప్పిరి

---

ఆసిఫాబాదు

## ౨౦౦ గోండులు అధికారులను ఎదిరించుట

ఆసిఫాబాదులోని బాబ్‌ఝరీ అనేగ్రామంలో గుట్టలుకలవు. అచ్చట ౨౦౦గోండులు ఆయుధపాణులై ౮ అబాన్ నాడు పోలీసు మొహతమీమును తాలూక్దారును ౧౦౦ పోలీసుదళాన్ని ఎదిరించినారని జనులు అనుకొనుచున్నారు, కొన్నిదినాలకుముందు ఈగ్రామంలో గోండులు అడవిశాఖ నౌకర్లపైబడి కొట్టియుండిరి పోలీసులు ఆసందర్భములో కొందరినిపట్టుకొనిరి. కొందరిని జమానతుపై వదలిరి, కొనిమరల వారిని పిలిపించగా వచ్చుటలేదని తిరుగబడిరి. ౨౦౦ గోండులు గుట్టపైకెక్కి పోలీసులను బెదిరించిరి. ౮ అబాన్ నాడు పోలీసు మొహతమీమున్ను తాలూక్దారున్ను ౧౦౦మంది పోలీసు జవానులతో ఆగ్రామంవెళ్ళిరి. వారినికూడా గోండులు బెదిరించిరి.

(అ. న్యూ)

---

## శ్రీరాజరాజ నరేంద్రాంధ్ర భాషానిలయము

హనుమకొండ, ౧౨—౯—౪౦

౪,౫,౬, అక్టోబర్ తేదులయందు ఆచార్య శ్రీరావాడ సత్యనారాయణగారి అధ్యక్షతను పై గ్రంథాలయ వార్షికోత్సవము జరుగునట్లు తెలియుచున్నది.

గ్రంథాలయ పాలకవర్గమువారు ఈ వార్షికోత్సవమునకు జిల్లామొత్తమునందుగల గ్రంథాలయములజాబితాను తయారుచేయించి వాటి వాటిపరిస్థితులను గమనించునట్లు చేయుటయు, జిల్లాకు ప్రధాననగరమగుటచే యిచటగల "శ్రీ రాజ రాజనరేంద్రాంధ్ర భాషానిలయమును" ప్రధాన గ్రంథాలయముగా నేర్పరచి జిల్లాయందంతటను గ్రంథాలయోద్యమమును చక్కగా జరిపించుటయు మిక్కిలి అవసరము

ఇట్లు
పండిత రామానుజస్వామి
ని. ఆం. గ్రం. సంఘకార్యదర్శి

---

## రాటంపుగ్గం

ప్రభుత్వపోత్సాహం

హైదరాబాదు, అబాన్ ౮

హైదరాబాదుప్రభుత్వమువారు రాటాలపై వడికించుటలో మగ్గాలపై నేయించుటలో ఏమైనా బీదలకు సహాయకారిగా ఉండగలదా అనిపరీక్షించుటకుగాను కొన్నిగ్రామాలలో ఏర్పాటుచేయించిచూడనున్నారని తెలియవచ్చుచున్నది. దానికై ఒకసంవత్సరానికి ౨౫౦౦ రూపాయిలను వ్యయముచేయుదురట వీటితో పాటు తాటిపట్టీలు, నవారాలు, చటాయీలు తాళ్లు, నేయుటనుకూడా నేర్పింతురట.

---

## బిదరు అగ్నికాండ

హైదరాబాదు(దక్కన్), అబాన్ ౮

బిదరులో దుకాణములుకాల్చిరను నేరములో ౨౬మందికి మున్సిఫీలో శిక్షఅయియుండెను. వారందరును మురాఫాచేసినారు. హైకోర్టువారువారిని జమానతుపై వదలినారు. ౩౦ అబాన్ నాడు విచారణకేర్పాటుచేసినారు—

---

అనంతగిరి క్షయాశ్రమము

హైదరాబాదు(దక్కన్), అబాన్ ౬

అనంతగిరిలో క్షయరోగుల ఆశ్రమమునకు పునాదివేయుకార్యము అబాన్ ౧౦వ తేది జరుగవలసియుండెనుకాని వశముగలేని కారణముచే మరియొకనాటికి మార్చబడినది.

---

## ప్రకటన

నిజాము సర్కారువారి స్టడ్‌ఫారము హింగోలికి మరియు హిమాయతుసాగర్ డైరిఫారమునకు మేలైన గోధుమపొట్టు పొట్టుధాన్యము, బార్లిధాన్యము, ఉలవలు, ప్రత్తిగింజలు మరియు పలువిధములైన నూనెలు సాలు ౧౩౫౦ ఫసలీకొరకు సరబరాయి చేయుటకు కోస్తావ్యాపారులవద్దనుంచి టెండర్లుకావలెను.

కొదువపద్ధతులు; వివరములు మొదలగునవి కనుగొనుటకు దరఖాస్తులు యీక్రింద విభజింపబడిన ఆఫీసుకు ౧౫ తేది అబాన్ ౧౩౫౦ ఫసలీవరకు పంపవలెను.

డైరెక్టరు
సివిల్ వెటర్నరి డిపార్టుమెంటు
ఈ.ఘ.వ. నిజాం గవర్నమెంటు
హైదరాబాదు-దక్కన్.

---


# గోలకొండ డైరీ

అచ్చైపోయినవి త్వరపడుడు.

"అమూల్యమైన రత్నాలగని"
—ముఫీదదక్కన్.

అయాచితంగా వచ్చిన మరొక అభిప్రాయమును చిత్తగించండి

"అయ్యా,
తమరు అతిశ్రద్ధతో తయారుచేసిన డైరీచూచి నాకు అమితానందకరమైనది. ఇటువంటి ఇన్నివిషయములు అమర్చివున్న డైరీ యీరాజ్యములో కేవలము తెనుగువిద్యలోయున్నదు శక్యలేదు. మద్రాసునుంచివచ్చే తెలుగుడైరీలలోగూడ ఇన్నివిషయములులేవు. నేను ౨౦ సంవత్సరములనుండి తప్పకుండ ప్రతిసంవత్సరము తెనుగుడైరీ తెప్పించుకొనుచున్నాను. అందులోకూడ మీడైరీలోవున్నన్నివిషయములులేవు. మనిషికికావలసిన అన్నివిషయములు చేరివున్నవి.

నేనీడైరీకొని చాలామంది తెనుగువిద్య నేర్చివున్నవాండ్లకుచూపి దీనిని కొనుటకు ప్రోత్సహించినాను. యీవిషయములో మిమ్ము అభినందించుచున్నాను. తెనుగువారిలో ప్రతివిద్యావంతుడు ఈ గోలకొండడైరీనికొని లాభమునుపొందగలరని కోరుచున్నాను.

కిషన్‌రావు దేశముఖ్,
తేది ౮ అబాన్ ౧౩౫౦ఫ అలంపల్లి నివాసి, పోస్టు వికారాబాద్"

చర్మపుబైండు డైరీలకై ఆర్డర్లువచ్చినవి. అట్టివారు ఒకవారందినాలు ఓపికపట్టవలెను. క్యాలికో అర్డర్లు సప్లైచేయుటే దుర్ఘటమైపోయినది.

డైరీవెల చందాదారులకు క్యాలికో బైండుది
౧-౨ అణాలు మాత్రమే-
చర్మముది ఆర్డరు పైననే తయారు చేయబడును-
ఇతరులకు ౨ అణాలు ఎక్కువ.

మేనేజరు గోలకొండపత్రిక,

దొరకు స్థలములు:—దక్కన్ పాపులర్ న్యూస్ ఏజెన్సీ-వరంగల్, సాహెబ్‌రాంగారు, న్యూస్ ఏజంటు-నిజామాబాదు, గణాపూర్ లచ్చప్పగారు-తాండూర్, ముల్కి-ఖాదీస్టోర్సు-కరీంనగర్


---

హి.ఘ.వ. నిజాంస్టేటు రైల్వే

# నోటీసు

హైద్రాబాదు బి.జి. మరియు భోనగిరిమధ్య నడచు నెం. 101 అప్ మరియు 102 డౌన్ పటేల్ బండ్లు మరియు శికింద్రాబాదు వికారాబాదులమధ్య నడచుచున్న నెం. 65 రైలుకారు రద్దుచేయబడుట.

1 అక్టోబరు 1940 మంగళవారమునుండి యీక్రిందిబండ్లు రద్దుచేయబడినవి

నెం. 102 అప్ పటేల్:-భోనగిరినుండి 7_12 గంటలకు బయలుదేరి హైద్రాబాదు బి.జి నుండి 9_12 లకు బయలుదేరి శికింద్రాబాదుకు 9_47 గంటలకు చేరునది.

నెం. 102 డౌన్ పటేల్:-హైద్రాబాదు బి.జి. నుండి 16_55 గంటలకు బయలుదేరి భోనగిరికి 19_10 గంటలకు చేరునది. మరియు

నెం. 65 రైలుకారు:-శికింద్రాబాదునుండి 7 గంటలకు బయలుదేరి వికారాబాదుకు 9_22 గంటలకు చేరునది.

2. 1 అక్టోబరు 1940 నుండి ఘట్‌కేసర్-బీబీనగర్ మధ్య 136/1-2 మైలువద్దనున్న అంకుశాపురంగేటు ప్రయాణీకులకొరకు మూసివేయబడును.

శికింద్రాబాదు
11_9_1940

బై ఆర్డర్

---


తగ్గింపుధరలు! తగ్గింపుధరలు!

## స్వచ్ఛమైన ఖాదీయని పూచీ

దేశ పరిశ్రమలను అభివృద్ధికి తెచ్చి దేశీయులు సౌభాగ్యవంతమైన పవిత్ర జీవనము గడుపుటకు వీలగునట్లు పరిశుద్ధమైన ఖాదీ తయారుచేయించినాము.

ఇదివరలో పండుగసందర్భములలో మేము మాగిరాకులకు యిచ్చుచున్న కమీషనులను ఆపివేసి దానికిబదులు ఖాదీధరలు తగ్గించినాము.

క్రొత్తరకముల కోటు, షర్టింగ్, బట్టలు, చీరెలు, దోవతులు, ఉత్తరీయములు దొరకును.

# భాగ్యనగర ఖాదీ వస్త్రాలయము

సుల్తాన్‌బజారు, హైదరాబాదు-దక్కన్.


---

## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై
సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీం.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారు 1946 సంవత్సరపు 3o/o డిఫెన్సు బాండ్లు ప్రకటింపబడిన రేటుప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తామబాండ్లుకోరిన మొత్తములో ప్రతి ... ను ముందుగా చెల్లింపవలయును రూ. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును

(3) తరువాతి బాండ్లమొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును మొదట మూడు నెలలకు ప్రతినెల 5 గాని అంతకెక్కువగాని చెల్లింపవలయును మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్నవారి సౌకర్యానుసారము చెల్లింపవలయును

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపబడిన కస్తుమొత్తములపై బ్యాంకువారు నూటకి 2 1/2 వంతున వడ్డీయిచ్చెదరు.

(5) పూర్తిమొత్తముచెల్లించిన తరువాతి బాండ్లుయివ్వబడును

(6) బాండుమొత్తము పూర్తిగా చెల్లించినతరువాత ... 2 1/2 వడ్డీ ... బాండు యివ్వబడినతేదినుండి సరియైనవడ్డీ చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తిమొత్తమును చెల్లించక [illegible] దానిని మార్కెటురేటుప్రకారము [illegible] కస్తీకి కలసినసైకమును పట్టుకొని మిగతసైకము యిత్తురు

హైదరాబాదు-దక్కన్
28—8—40

కె. జె. వికాజీ,
మేనేజరు.

# ఖాదీ ప్రచారకసంఘము హైద్రాబాదు దక్కన్

## కార్యనిర్వాహకవర్గ సమావేశము

(స్వ. వి.)

హైదరాబాదు(దక్కన్), అబాన్ ౨

సెప్టెంబరు ౧౨వ తేదీ మధ్యాహ్నము ౨గంటల నుంచి ఖాదీప్రచారసంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశము శ్రీయుత ప్రేమ్‌జీ మేఘజీగారి అధ్యక్షత క్రింద శ్రీయుత రామకృష్ణధూతగారి భవనములో సమావేశమాయెను.

శ్రీయుతులు అన్నాసాహెబు సహస్రబుద్ధి (మహారాష్ట్ర చరఖాసంఘ కార్యదర్శి), హెచ్. యస్. కామిల్లి (కర్ణాటక మహారాష్ట్ర చరఖా సంఘ కార్యదర్శి) గార్లకు ప్రత్యేకాహ్వానములు పంపబడెను శ్రీ అన్నాసాహెబుగారు కొందరు ప్రముఖులు జిల్లాలనుంచియువచ్చి కార్యక్రమములో పాల్గొనిరి.

ఖద్దరు విరివిగా విక్రయమగుటకును, నిజాం రాష్ట్రములోని ఖద్దరు ఉత్పత్తిని ఈసంఘము వారి అధిపత్యముక్రిందకు తీసుకొనుటకునుగల అవకాశములను ఆలోచించి నివేదికనుపంపుటకు శ్రీయుతులు శ్రీధర్ నాయక్, రామచంద్రరావు అంతు, కే. యస్. వైద్య, లక్ష్మీనివాస్ జి గనేరివాల్, మరియుహరిశ్చంద్ర హెడాగార్లను ఉపసంఘముగా నియమించనైనది. శ్రీహరిశ్చంద్రహెడాగారు సమావేశకర్తగా పనిచేయుదురు.

శ్రీ జావపాటి సత్యనారాయణగారిని ఆంధ్ర ప్రాంతీయ కార్యదర్శిగా నియమించుచూ, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతీయ కార్యదర్శులను నియమించు అధికారము అధ్యక్షులవారికియ్యబడినది.

హైద్రాబాదు, సికింద్రాబాదులయందు శ్రీ గాంధీజయంతిని జయప్రదముగా జరుపుటకు ఒకఉపసంఘమును నియమించడమైనది. శ్రీమతిహరిశ్చంద్రహెడాగారినిసమావేశకర్తగా నియమించడమైనది, జయంతి సెప్టెంబరు ౨౨వ తేదినుంచి ౧౫ దినములు రాష్ట్రమందంతట జరుపుటకు నిశ్చయించడమైనది.

---

## ప్రభుత్వ శాసనసభ్యులు

హైదరాబాదు అబాన్ ౫

ప్రభుత్వమువారు ఈక్రిందివారిని శాసనసభలో రెండేండ్లపాటు కూర్చునుటకై నామకరణముచేసుకొని యేర్పాటుచేసుకున్నారు. నః సముద్రయార్ జంగు. నః అలీయావర్ జంగు, నఃరైసు జంగు, నః రహ్మత్ యార్ జంగు, లియాఖతుల్లా, ఫజలుల్లా, ఖురేషీ, ఏకనాథప్రసాదుగారలు.

---

# బాలికల ఉన్నతపాఠశాల

(నారాయణగూడ)

## దాదాబాయి నౌరోజీ జన్మదినోత్సవము

హైద్రాబాదు(దక్కన్), సెప్టెంబరు ౬

౪వ సెప్టెంబరు తేదీన నారాయణగూడ బాలికల ఉన్నతపాఠశాలలో సాయంకాలము ౩-౩౦ గంటలకు దాదాబాయి నౌరోజీ జన్మదినోత్సవము జరుపబడెను. ఈసమయమున మిస్. బి, బి హిరికేఖర్ షీదుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. ప్రార్థన ముగిసినపిమ్మట ఈపాఠశాలలోఉండిన శ్రీదాదాబాయి నౌరోజీ ఉచితపఠనమందిరము, పుస్తకభాండాగారముయొక్క వార్షికనివేదికను మిస్. సులోచనాబాయిగారు చదివి వినిపించిరి. తరువాత అగ్రాసనాధిపతి తన ఉపన్యాసమును చేదివి వినిపించిరి. అందు ఆమెగారు పైనచెప్పబడిన మెమోరియల్ అసోసియేషన్‌యొక్క ఉత్పత్తినిగూర్చియు బొంబాయిగవర్నమెంటువారు వారిరాజ్యములో శ్రీదాదాబాయిపేరట ఏర్పడి పనిచేయుచున్న గ్రామపుస్తక భాండాగారములకు పఠనమందిరములకు ఇచ్చిన గ్రాంటులనుగూర్చియు ప్రశంసించిరి. అనంతరము పాఠశాలపిల్లలు చెంబులతో నృత్యమును, ఇతరవిధములైన నృత్యములుజరిపి ఆనందింపచేసిరి.

అధ్యక్షురాలు మిస్. బి బి. హిర్ జీకర్ షీదుగారు పాఠశాలకు ౨౫ పుస్తకములును, వార్షిక చందా బి. జి. రూ ౨౦లను దానముజసగిరి.

---

## ఆర్యసమాజపు క్రొత్త ఎన్నికలు

హైద్రాబాదు-దక్షిణ అబాన్ ౨

తేది ౨౩ మెహరు ౧౩౫౦ ఫ. ౨౩ అగస్టు ౧౯౪౦ సాయంకాలము ౫౦. గంటలకు అకబరుజాబాజారు ఆర్యసమాజము వార్షికయెన్నికల సందర్భమున యీసంవత్సరము కార్యభారము వహించుటకై క్రిందనుదహరించబడినవారు యెన్నుకోబడిరి.

| | | |
|---|---|---|
| యం. శివరాజుగారు | ... | ప్రధాన్ |
| యం. యీశ్వరయ్య | ... | ఉపప్రధాన్ |
| ఆ. రాజయ్య | ... | మంత్రి |
| భజరంగుగారు | ... | ఉప మంత్రి |
| ఆయిలయ్యగారు | ... | కోశాధ్యక్షుడు |
| భీకంప్రసాదుగారు | | పుస్తకాధ్యక్షుడు |

---

## సికింద్రాబాదు జడ్జి

సికింద్రాబాదు(దక్కన్), అబాన్ ౪

సికింద్రాబాదుకోర్టు జడ్జీగా బళ్ళారిలో అడిషనల్ జడ్జిగా పనిచేసిన బార్టర్ అనువారు ౯ సెప్టెంబరునాడు వచ్చి పని ప్రారంభించినారు.

---

# న్యాయస్థానధిక్కార నేరము

హైదరాబాదు (దక్కన్), అబాన్ ౪.

వై. డీ. జోషి గారు, ప్రేమకుమారు. మారుతీ రావుజోషి గోరేఅనువారు కోర్టులో విచారణ జరుగుచుండిన వీవరుయొక్క కొందెమునుగూర్చి వీవరు అగ్నికాండమునుగూర్చి ఒకప్రకటన చేసియుండిరనియు అది న్యాయశాస్త్రప్రకారము కోర్టుధిక్కారము గానున్నదనియు వారిపై కేసు మోపబడి హైకోర్టులో విచారణకు వచ్చెను. రామకృష్ణారావుగారు నిందితులపక్షాన నిలబడినారు. కేసులోఆన్నీ అవకతవకలే ఉన్నవని రావుగారువాదించినారు నిందితులపై చేసినదావాపై ఏప్రభుత్వాధికారి సంతకమున్నూ లేదనిరి. ఇట్టి అభియోగాలలో అడ్వకేటు జనరల్ మాత్రమే దావాచేయనర్హులు. ఈకేసులో పబ్లికుప్రాసిక్యూటరు అడ్వకేటుజనరల్ వర్ణనలోకిరాడు మరియు అతడున్ను తనవ్యక్తిపరంగా అభియోగము తేనలేసియుండెను. ఇట్టిఅభియోగం డివిజనల్ బెంచిలో తేవలెనుకాని యిచ్చట మున్సర్దాలో కేసు రుజువుచేయబడినది అభియోగంతోపాటు ప్రమాణపత్రమునుకూడా ఇచ్చుకోవలసియుండెను. అదికూడా యిందు లేకపోయినది. ఈకారణాల చేత అభియోగము కొట్టివేయవలెనని రామకృష్ణరావుగారు వాదించినారు

సర్కారీవకీలగు మక్తూజాఖాన్ గారు ఇట్లు జవాబిచ్చుకొనిరి. హైకోర్టుశాసనం సూత్రముల ప్రకారం మున్సర్దా కధికారమున్నది. కోర్టువారే స్వయంగా యిట్టికేసులను స్థాపించవచ్చును. ఈ కేసులో కోర్టువారింతవరకే దీనినిఆదరించినారు. కాన ఏవైనా చిల్లర ఆక్షేపణలుండిన అవిచెల్లనేరవుఅనిఅన్నారు. న్యాయస్థానమువారు ఉభయ వాదాలు వినుకున్నారు. తీర్పుఇంకను చెప్పలేదు.

---

చగన్‌లాల్ నారాయణ్ జీ
అత్తరు వ్యాపారులు.
ఉస్మాన్ బజారు హైద్రాబాదు.
మావద్ద అన్నివిధములైన స్వదేశ అత్తరు తైలములు అగరుబత్తీలు, కుంకుమపువ్వు, చాయపత్తీలు జరమొదలగునవి అమ్మబడును

పాండురంగ
బ్రాహ్మీ తలనూనె
ట్రేడ్ P మార్క్
యీతలనూనె 21 వనమూలికలతో శాస్త్రోక్తముగా తయారుచేయబడి శరీరమునకు, మెదడునకు చల్లదనమునిచ్చి శిరోజములను వృద్ధిజేయును, మనోహరమైన సువాసనను గల్గియున్నది. యీ సుప్రసిద్ధతైలము లోకవ్యాప్తిజెంది అనేక యోగ్యతాపత్రములను బొందియున్నది.
మావద్ద ఉసిరికనూనె, మసాలనూనె, నవరత్ననూనె వగైరాలు సర్వదా లభింపగలవు.
స్టాకిస్టులు:-కింగ్ అండ్ కో., స్టేషన్‌రోడ్, హైదరాబాదు-దక్కన్.
పాండురంగ ప్రాడక్టు వాడి-జంక్షన్.

మధు మేహం
అడవిలో పెద్దపులి సమీపించిన వారైనను దైవవశమున తప్పించుకుని జీవించవచ్చును గాని యీవ్యాధిగలవారు గొప్ప అదృష్టముండినగాని దీర్ఘాయుష్మంతులుగాజాలరు. అతిసుకుమారులకును, అతిభోగవంతులకును, వ్యభిచారపురోగములచేతను, మేహముప్రకోపించి సప్తధాతువులు క్షీణించి రక్తశుక్లములు చెడిపోయి, మూత్రము బొట్లుబొట్లుగాపడుట, చురుకు, మంట, పోటు, అతిమూత్రము, రాత్రిళ్లుయెక్కువగా మూత్రించుట, పాలవలెచిక్కగా, తెలుపుగా, నురగతో వెళ్లుట, తేనెమాదిరిరంగుగా వెళ్లుట, మూత్రించినచోట చీమలు, ఈగలుపట్టుట, నాభిక్రిందిభాగముయెత్తుగా నొప్పి, పోటు, బాధిగల్గిరాత్రినిద్రపట్టకుండుట, దాహము, నోరెండుకొనిపోవుట, దుస్వప్నములు, జ్ఞాపకశక్తి, సంభోగశక్తి క్షీణించుట, కోపమధికమగుట, మనశ్శాంతిలేకుండుట, యీ లక్షణములుండును. ఈ మహాభయంకరవ్యాధి సామాన్యమందులకు, ఇంజక్షనులకు, ఇంగ్లీషుమందులకు సంగములకొలది లొంగనను లక్ష్యపెట్టుటిదికాదు 26 సం॥రములనుంచి ప్రత్యేకానుభవమున ప్రయత్నప్రయాసలతో బంగారు, వెండి, అభ్రకం, వైక్రాంతం పుష్యరాగములు, పగడములు, మంచిముత్యపుభస్మములు, యింకను అనేక దివ్యఔషధీసారములచేత తయారుచేయబడిన "మధుమేహామృతం" మావద్దకువచ్చినవారికి 3 రోజులలో కొంతగుణముచూపించి పంపబడును.
1 నెలకు 2 మందు 60 గుణముజూపుటకు శాంపిలు 3 రోజులమందు రు 6/- పంగీఖర్చు 0-8-0 మనిఆర్డరుచేసినవారికి మందుపంపబడును జవాబుకుబిళ్లలు పంపవలెను.
మధుమేహ చికిత్సాలయం
252 బి. ఆజంపురా హైద్రాబాదు.

హెచ్చరిక!
మోసపోకుడు
నియమరహితులగు వ్యాపారస్తులచే అనేకధరలలో సులోచనములు ప్రకటింపబడి నమ్మకములను చెడగొట్టబడుచున్నది. అద్దములన్నియు ఒకేరకముగాయుండును. అట్లే మాత్రలు, దంతములుకూడ యుండును. అందువల్లనే మోసమెక్కువ జరుగుచున్నది. మీరు గమనింపలేరు.
నేత్రము అమూల్యములు, మీవైద్యుని, దంతవైద్యుని కుదుర్చుకొన్నట్లే నేత్రవైద్యునికూడ శాస్త్రపరిజ్ఞానముగలవాని సలహాపొందుడు. అట్లు సలహాపొందిన తనుపరి అద్దములు కొనువిషయమున-తగుజాగ్రతవహించవలయును. నేడు రేపు, అందరూ సులోచనముల నమ్మువారే! నూటికి 99 వంతులు సక్రమముగా అమర్చబడని చట్టములు, కనుబొమలకు అద్దములానునట్లు చేయుటయో లేక దృష్టిభేదముకల్గునట్లు కంటికి దూరముగా నమర్చుటయే జరుగుచున్నది. ఇది యంతయు, నేత్రవైద్యులుతిరిగి ఆ అద్దములు చూడకుండుటచేతనే జరుగుచున్నది.
ప్రస్తుతకాలములో ప్రతివారు అందముకొరకు గుండ్రని యద్దములనే కొనెదరు కాని, తమ కంటికి శాస్త్రోక్తముగా సరిపోవు అద్దములను కొనరు.
వివిధములగు ముఖములకు, వివిధములగుఅద్దములుకావలెను. నాలుగురకముల ముఖములుగలవు.
పొడుగుముఖము: (సాధారణముగా పొడుగువారికుండును) అట్టిదానికి కొంచెము కోలగాయున్న అద్దములను, ఎక్కువదూరము కనుపడుటకు అమర్చవలెను.
వెడల్పుముఖము: (పొట్టివారిముఖము) అట్టివారికి పూర్తిగా కోల ఆకారముగల అద్దములు అమర్చవలెను.
గుండ్రనిముఖమునకు అష్టకోణములుగల అద్దము అమర్చవలెను.
ఎత్తైన కనుబొమలుగలిగి గుంటకండ్లున్నవారికి అకుఆకారముగల అద్దములను, కనుబొమలకు తగులకుండగను, కనురెప్పల కంటకుండగను అమర్చియివ్వవలెను. అకుఆకారముగ ముఖముగల వారికిని చాలఅందముగయుండును.
శరీరముయొక్క రంగునుబట్టి రంగులచట్టములు ఇవ్వవలయును. బర్గండీ, మోటిల్డుజెలో, వైట్‌గోల్డు, గ్రీనగోల్డు, ట్యాన్, రోల్డుగోల్డు, మొదలైనవి తగినట్లుయివ్వవలయును. వట్ బ్రౌన్ రంగుగాయుండువారలకు షేక్ రకము అందముగాయుండును. నవీనపద్ధతులలో జైలో మోటుఅయినది. చిన్నముఖములకు అందమునివ్వదు నూటికి తొంబదిమంది అద్దములు గోరుచువారు ముక్కుపై మచ్చయో, వాతయో, లేక బాధనో కలిగియుందురు. ఏనుగు తుండమువలెను, పిల్లిముక్కువలెను, అలుగడ్డవలెను ముక్కులుండువారికి తగిన చట్టములు ఇవ్వనిచో ఈ బాధలు తప్పవు.
సులోచనములు శాస్త్రోక్తముగా అన్ని విషయములను పరిశోధించిన వైద్యుని సలహాపై ఆధారపడి యుండవలయునేగాని, మన యిష్టప్రకారము చేయగూడదు.
సలహా నేత్రవైద్యులు డా॥ కె. పి. పాపట్.
యల్. ఆర్. సి. ఎస్. పి. సి.
యస్. యన్. యం. (ఎడిం)
Khan & Sons.
హార్డి అండు కో
సులోచన వ్యాపారులు-లండన్,
124 జేమ్సుస్ట్రీట్-సికింద్రాబాదు

ఇండియాను బలిష్ఠము చేయుడు
మీ దేశబలమే మీ సంరక్షణ
మీ దేశరక్షణకు, మీరక్షణకుకూడ ఇండియాకు ఇంకా ఎక్కువ మంది శిక్షణపొందిన మనుష్యులు, ఎక్కువ టాంకులు, ఎక్కువవిమానములు, ఎక్కువ మరఫిరంగులు కావలెను. డిఫెన్సు లోన్సు కొనుటవలన మీరు ఈ ముఖ్య అవసరములకు సహాయముచేసినవారగుదురు. ఇట్లు చేయుటవలన ఇండియాక్షేమము, మీక్షేమము స్థిరపడ గలదు.
ఇంతేగాక ఇందువల్ల మీరుభద్రము, లాభకరమైన పెట్టుబడి పెట్టినవారగుదురు. ఆ పెట్టుబడికి ప్రభుత్వము, దేశములోని అన్ని ఆధారములయొక్కయు ప్రోత్సాహమున్నది.
డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లు రూ. 10. రూ 50. రూ. 100. రూ. 500ల మొత్తములకు ఇవ్వబడును. పది సంవత్సరముల తరువాత ప్రతి 10 రూపాయలకు రూ. 13-8 చొప్పున తిరిగి ఇవ్వబడును సుమారు నూటికి 3½ సాలుసరి కాంపౌండు వడ్డీ ఇవ్వబడును. ఈ రాబడిమీద ఇన్‌కంటాక్సు లేదు. ఒక వ్యక్తి రూ 5,000లకు ఎక్కువగాని మొత్తమునకు తీసుకొనవచ్చును మీకు సమీపమున ఉన్న పోస్టాఫీసులో దరఖాస్తు పెట్టుడు.
నూరేసి రూపాయల మొత్తములకు ఆరు సంవత్సరముల డిఫెన్సు బాండ్లు జారీ చేయబడును. 1946 సం అగస్టు 1-వ తేదీన ఒక్కొక్క నూటికి రూ 101లు తిరిగి ఇవ్వబడును వడ్డీ నూటికి రూ. 3 చొప్పున ప్రతి ఆరు మాసములకు ఇవ్వబడును. ఎవరైనను, ఎంత మొత్తమునకైనను తీసుకొనవచ్చును రిజర్వు బ్యాంకులో గాని, ఇంపీరియల్ బ్యాంకులోగాని, గవర్నమెంటు ట్రెజరీలలోగాని దరఖాస్తు పెట్టుకొనుడు
50 రూపాయలకు పైబడిన మొత్తములకు వడ్డీ లేని బాండులు ఇవ్వబడును ఇవి 3 సంవత్సరముల తరువాత తిరిగి యివ్వబడును ఒక సంవత్సరము గడచిన తరువాత మూడు నెలల నోటీసుతో తిరిగి ఇవ్వబడును మీ అవసరము రుజువు అయినతో ఎప్పుడైనను సరే తిరిగి ఇవ్వబడును. రిజర్వు బ్యాంకులో గాని, ఇంపీరియల్ బ్యాంకులో గాని. గవర్నమెంటు ట్రెజరీలలో గాని దరఖాస్తు పెట్టుకొనుడు.
ఇండియా డిఫెన్సులోన్సు కొనుడు
To G. I. 3

సంవత్సరము చందా ౬ రూ॥ మాసాములు ఆరుమాసాలకు ౩ మాసాలకు (?)టిసిండి యూలో సం॥ చందా ౫-౮-౦ కల్దారు. పాతపత్రికలకు వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Popular Paper That reaches The masses In the Dominions — Best Medium for Advertisement

**Volume 15** **Hyderabad-Dn.** **Monday 16 September 1940** **Number 38**

## బాల్కన్ వ్యవహారాలలో రష్యాకునూడ భాగం

### జర్మనీకి రష్యావారి కోరిక

ఇదివరలో జర్మనీ ఇటలీలు రష్యాకు రుమేనియా లేక పలుకుబడియొక్క ఆవరణలోనుండకల వీలదేగాని రష్యాపలుకుబడియొక్క ఆవరణలో నుండదగినదికాదని తెలిపేపత్రములను సమర్పించుకొనినట్లు వినియుంటిమిగదా! ఇప్పుడు రష్యా ప్రభుత్వమువారు తమరాజ్యముకూడ డాన్యూబునది నానుకొనియున్నదనియు, అందువలన డాన్యూబు ప్రాంతమునుగూర్చి చర్చించుటకై జర్మనీవారు వియన్నాలో సమావేశపరచుచున్న సభలో తమప్రతినిధులుకూడ పాల్గొనితీర్మానములను చేయించుట అవసరమనియు జర్మనీ ప్రభుత్వమువారికి తెలియజేసినారు.

కొన్నివారములనుండి రష్యా రుమేనియాలమధ్య క్రొత్తగాఏర్పడిన సరిహద్దువద్ద రష్యారుమేనియాలసేనలకు సంఘర్షణములు జరుగుచున్నవి. ఇప్పుడు ఆక్రొత్తసరిహద్దుగా ప్రూత్ నదివెంట రష్యాసేనలు చేర్చబడియున్నవి. రష్యా ప్రభుత్వమువారు ఈసంఘర్షణలవిషయమై రుమేనియా ప్రభుత్వమువారికొక సందేశమును పంపించినారు.

## రుమేనియాలో నియంతృత్వ పాలనము

సెప్టంబరు ౧౦వతేదినుండి ౧౪వ తేదివరకు వచ్చిన వర్తలలో హంగరీసేనలు హంగరీకియ్యబడిన ట్రాన్సిల్వేనియాను ఆక్రమించుకొనుచు దాని ముఖ్యపట్టణమగు క్లజ్ ను చేరినట్లు తెలిసినది. ఇప్పుడు స్లజాదాటి ఆవలిప్రదేశము నాక్రమించుకొనుచున్నవి. రుమేనియావారిసేనలు హంగరీకిచ్చివేసిన భాగమునుండి ఖాళీచేయుచున్నవి. శేషభాగము ఖాళీచేయబడినవి. హంగరీకి ఆప్రదేశము నిచ్చినందువలన ఉదయించు సమస్యలనుగూర్చి రుమేనియా ప్రభుత్వమువారు హంగరీ ప్రభుత్వమువారితో సంప్రదించుటకై కొందరుప్రతినిధులను నియోగించినారు. ట్రాన్సిల్వేనియాలో హంగరీయులుకొనట్టిఅల్పసంఖ్యాకులభాషయు, దానికి తగినట్లుబర్యను నిరాటంకముగా కొనసాగగలవు. హంగరీవారు కోరునదంతయు అల్పసంఖ్యాకులు హంగరీప్రభుత్వమునకు విధేయులైయుండవలెనని మాత్రమేయని హంగరీప్రధాని కౌంట్ టెలెకీగారు సెప్టంబరు ౧౦వతేదినాడు ప్రకటించినారు.

ఇప్పుడు రుమేనియాకుచెందిన బొనాత్ లో జర్మనులే ఎక్కువగానున్నారు. వారితమకు స్వపరిపాలనవ్యవస్థ కావలెనని కోరుచున్నారు. ఇది చూడగా రుమేనియా విచ్ఛేదము సమాప్తియైనట్లు కనిపించుటలేదు. బొనాతు ప్రాంతము యూరపుఖండములోకెల్ల మిక్కిలి గొప్పధనవంతమైన ప్రదేశముమాత్రమేగాక సైనికదృష్టిలో చాలముఖ్యమైనది.

### నిరంకుశపాలనము

ఇప్పుడు రుమేనియాకు క్రొత్తప్రధానియగు జనరల్ అన్టొనెస్కూగారు నియంతగా రాజ్యపాలనవ్యవస్థను చేయుచున్నారు. పూర్వము కెరోలురాజుగారి హయాములోనుండు ఆడంబరములు తొలగించబడుచున్నవి. ప్రభుత్వవ్యయములో ముబారా అపివేయవలసినదని ఆజ్ఞయైనది. క్రౌన్ కౌన్సిల్ అనునది తీసివేయబడినది. యువకోద్యమము అణచివేయబడినది. పూర్వపుమంత్రుల ఆస్తులవిలువనుగూర్చి విచారణ ప్రారంభించబడినది. రాజుగారి కార్యదర్శుల కార్యాలయపు ఖర్చులనుగూర్చికూడ విచారణప్రారంభించబడినది. సేనలో లోపములు తొలగించబడుచున్నవి. ఇప్పుడు రుమేనియా కొంతప్రదేశమును పోగొట్టుకొనుటకు కారణములైన అసామర్థ్యము, పరాజయభయముగలవారనితోచినగ౧ మంది గొప్పసైనికాధికారులుతీసివేయబడినారు.

ఖర్చు తగ్గించుటకై మెక్సికో, రియోడిజేనెరో, పెకింగ్ మున్నగుచోట్లలో ఇపుడున్న రుమేనియా ప్రభుత్వరాజకీయ ప్రతినిధుల కార్యాలయములు ఎత్తివేయబడుచున్నవి.

రుమేనియాప్రజలందరును ఈక్రొత్త నిరంకుశపాలనకు శాంతముతోను విధేయతతోను లొంగియుండవలసినదని అన్టొనెస్కూగారు విజ్ఞప్తిచేసినారు, ఆరాజకోద్యమములను లేవనెత్తువారలను బాగుగా శిక్షించెదమని ప్రకటించినారు, కొంతసేనను పనిలోనుండి పంపివేయుటకును, సేనలకై బలవంతముగ తెప్పించుపదార్థములను తగ్గించుటకును ఆజ్ఞలుచేయబడినవి.

### బల్గేరియా వ్యవహారము

రుమేనియా బల్గేరియాల ప్రతినిధులు దక్షిణడోబ్రుజాదానపత్రముపై సెప్టంబరు ౭వ తేదినాడు సంతకములను పెట్టినారు. ఈ ఒడంబడికపత్రముప్రకారము బల్గేరియా రుమేనియాలమధ్య సరిహద్దుగీత డాన్యూబునదినుండి సిలిస్ట్రియా ఉత్తరభాగమువెంట మాంగాలియాకు దక్షిణమున ౫ మైళ్ళదూరములో నల్లసముద్రముపై ఉండుచోటిని తాకుచుండును. ఉత్తరడోబ్రుజానుండి దక్షిణడోబ్రుజాకు మార్చబడవలసిన బల్గేరియనులు ౬౫౦౦౦ మంది ఉందురు దక్షిణడోబ్రుజానుండి రుమేనియాకు మార్చబడవలసిన రుమేనియనులు ౧౦౦౦౦ మంది ఉందురు

## ఆంధ్రమహాసభ స్థాయిసంఘ ప్రకటన

హైదరాబాదు (దక్కన్), ఆగ౯ ౨

పట్టీసంఘములలో ఆంధ్రమహాసభా నిర్మాణ కార్యక్రమమును నడిపించుటకు అర్గనైజర్లు (౧౦) గురు కావలసియున్నారు. అర్గనైజర్ల వేతనము యోగ్యతసమర్థతలనుబట్టి రు. ౨౦ నుండి రు. ౨౫ వరకు యివ్వబడును అర్గనైజరులవిధులు క్లుప్తముగ ఈక్రింద నుదహరింపబడుచున్నవి.

౧. పట్టీలోచేరిన గ్రామాదులలో ప్రతిరోజూదౌరాచేసి గ్రామవాసుల కష్టములను, అవసరములను తెలిసికొని వాటివిషయములో తగుచర్యతీసికొనుట.

౨. పట్టీసంఘ కేంద్రస్థానమున రాత్రి వయోజనపాఠశాలను నడిపించుట.

౩. ప్రభుత్వమువారి పాఠశాలలులేని గ్రామాగులలో స్థానికప్రముఖులను ప్రోత్సహించి ఖాసగీపాఠశాలలో బడులను స్థాపించుట.

౪ జనులలో దేశపరిస్థితులను తెలిసికొనుటకు వార్తాపత్రికలుచదువుటకు అభిలాషగలిగించుట

౫ ఆంధ్రోద్యమసంబంధమగు ఇతరనియమితకార్యములు చూచుకొనుట.

అభ్యర్థులు ౨౦ సంవత్సరములకు ఎక్కువవయసు కలిగినవారై, ముల్కీలై, కనీసము మెట్రిక్యులేషనువరకు చదువుకొన్నవారై తెలుగు ఉర్దూలోసరిగ చదువను వ్రాయను మాటలాడగలవారై యుండవలయును ఆగ౯ ౧౫వ తేదివరకు స్థాయిసంఘ కార్యాలయమునకు దరఖాస్తులు పంపవలయును దరఖాస్తులు అంగీకరింపబడిన అభ్యర్థులకు శిక్షణయియ్యబడును.

అభ్యర్థులందరు ౨౩ ఆగ౯ నాడు ౯ నుండి ౧౨ గంటలవరకు కార్యాలయమునకు వచ్చెదరు ఏతెంచిన వారియోగ్యతలను పరిశీలించి నియామకములు జరుపబడును

చిక్కేపల్లి రామచంద్రరావు

ఆంధ్రమహాసభ స్థాయిసంఘము కార్యదర్శి.

తుర్రెబాజ్ ఖాను రోడ్డు, మొజంజాహీమార్కెట్టువద్ద హైదరాబాదు-దక్కను.

గద్వాలసంస్థాన యువరాజుగారగు శ్రీరాజా కృష్ణరామభూపాల్ రావుబహద్దరుగారు

వీరి ఆరవఏట పైపటముతీసికొనబడినది.

ఇప్పుడు శ్రీవారు ౧౩ సంవత్సరముల వయస్సుకలవారు. వీరిని గద్వాలసంస్థానానికి దత్తుగా స్వీకరించుటకు గతవారము ము.ఘు.వ. నిజాం ప్రభువుగారు అనుమతిని అనుగ్రహించినారు.

## కోర్టుధిక్కారం

హైదరాబాదు(దక్కన్), ఆగష్టు

బీదరు అల్లరుల సందర్భములో విచారణ జరుగుచుండగా వై. డీ. జోషీ వగైరాలుఅక్షేపాయ ప్రకటనచేసి న్యాయస్థాన ధిక్కారము చేసినవారిపై అభియోగం వేసెడేను. కాని ఆయభియోగంలో చాలా అవకతవకలున్నవని సంగితుల పక్షాన వాదింపబడెను. చివరకు ఈ అవకతవకలను గురించి పూర్తి నిర్ణయంచేయండి అని హైకోర్టు మున్సర్గారు కొమిలాను అభియోగం కట్టను మార్చినారు. నిర్ణయంకావలసిన విషయాలనుకూడా క్రిందికోర్టువారు సూచించినారు- ఇట్లాటి కేసులలో ఎల్లవర్తించుకోవలెను- నడుచుకోవలసిన న్యాయశాస్త్రపద్ధతులేవి? మున్సద్ కోర్టు యధికారాలేవి? ఎవరిట్లికేసులను దాఖల్ చేయదగ్గవారు- కోర్టు స్వయంగా ఇట్టికేసులను నడిపించుటకు ఆజ్ఞయియ్యవచ్చునా? అనునవి నిర్ణయంకావలసిన విషయాలు.

## కాంగ్రెస్ కార్యసంఘ సమావేశము

బొంబాయి, సెప్టంబరు ౧౩

కాంగ్రెసు కార్యసంఘసమావేశము నేడుమధ్యాహ్నము రెండుగంటలకుబిర్లాభవనములో మౌలానా అబుల్ కలాం ఆజాదుగారి అధ్యక్షతను ప్రారంభమయినది. సభ్యులేగాక ఆహ్వానింపబడిన ముఖ్యులును హాజరైరి. సర్దారుపటేలు, సి. రాజగోపాలాచారి, ఖాన్ అబ్దుల్ గఫారుఖాను, పండిత నెహ్రూ, పండిత గోవిందవల్లభపంతు, కృపలానీ, అసఫలీ, డా॥ సయ్యదు మహమూదు, డా॥ ప్రఫుల్లచంద్రఘోషు, శంకరరావుదేవు, డా॥ పట్టాభిసీతారామయ్య, భూలాభాయదేశాయి, శ్రీమతి సరోజనినాయుడు, శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గార్లు వచ్చిరి.

### కాంగ్రెసునాయకులతో మహాత్ముని సంభాషణ

నేడు పొద్దున బిర్లాహౌసులో మహాత్మా గాంధి, మౌలానాఆజాదు, పటేలు, నెహ్రూ గార్లు మొదలయిననాయకులు చాలాసేపు సంభాషించిరి. మహాత్ముడు కార్యసంఘసభ్యులలో ఒక్కొక్కరితోను విడివిడిగా మాట్లాడెను. తరువాత అందరితోనుకలసి మాట్లాడెను. అందరిభావములను మహాత్ముడు బాగుగా తెలుసుకొనెను. ముందుజరుగవలసిన పనినిగురించి మహాత్ముడు కొంతకాలమునుంచి ఆలోచిస్తూనేఉన్నాడుగాని యింకాయేమీ నిర్ధారణ చేసుకోలేదని తెలిసింది.

సెప్టంబరు ౧౨వ తేది మధ్యాహ్నముకూడ మౌలానాఆజాదు పండిత జవహరలాలునెహ్రూ, సర్దారు వల్లభాయిపటేలు, బూలాభాయిదేశాయి ఖాన్ అబ్దులుగఫూరుఖాను గార్లు మొదలయిన నాయకులు బిర్లాహౌసులో గాంధిమహాత్మునితో చాలాసేపు యిష్టాగోష్ఠిగా సంభాషించిరి. సంభాషణలను చాలారహస్యంగా వుంచుతున్నారు.

## జర్మనీపైబ్రిటిషువిమానాల దాడులు

జర్మనీపైనను, జర్మనీక్రిందనున్న ఫ్రాన్సు బెల్జియం, హాలెండు, నార్వే దేశాలపైనను రాత్రివేళల బ్రిటిషువిమానాలుతిరిగి సైనికప్రాముఖ్యముగల రైల్వేలు, విమానాశ్రయాలు, ఓడలు, మందుసామగ్రి మున్నగువాటిమీద బాంబులను వేయుచునేయున్నవి. ప్రతిరోజూను అర్ధరాత్రివేళల జర్మనీప్రధాననగరమగు బర్లినుపై బాంబులువేయబడుచున్నవి. సెప్టంబరు ౧౦ వతేది ఉదయము, రాత్రి బర్లినుపైదాడులలో జర్మనుపార్లమెంటుఆగు రీచుస్టాగుసభయొక్క భవనమునకు దెబ్బలుతగిలెను. నగరములో ఆరోగ్యశాలలలో మంటలుతేచెను పోట్సుడాం రైల్వేస్టేషనుపై బాంబులువేయబడెను. అయిదువందలమందిజనులు చచ్చిరట, ౧౧ వతేదిరాత్రిపెట్రోలును శుద్ధపరచు కార్ఖానాయు, కొన్నికర్మాగారాలునుపాడయ్యెను, ఇంకనుచాలనష్టమయ్యెను.

ఫ్రెంచి సముద్రతీరములో కలెతీరముపై ౧౦వ తేదిరాత్రిదాడివల్ల ఆరుఈబోట్లనుండిరెండునష్టమయ్యెను. ౧౧వ తేదిరాత్రి డన్కర్కు రేవుదగ్గర సముద్రంలో జర్మనులకేవో సామగ్రినిగొనిపోవుఓడలపై బ్రిటిషువిమానాలు బాంబులువేయుటచే ఒకటిమంటలపాలయ్యెను, ఇంకొకటి దెబ్బతినెను. ౧౨వ తేదిరాత్రిదక్షిణజర్మనీలలో రైలుమార్గాలపై బాంబులువేయబడెను.

ఈదాడులనుండి తిరిగి స్వస్థానానికుచేరని బ్రిటిషువిమానాలసంఖ్యయిట్లుండెను:

| | | |
|---|---|---|
| సెప్టంబరు ౭ | | ౭ |
| „ ౯ | | ౩ |
| „ ౧౧ | | ౩ |

మధ్యాహ్నము ౨ గంటలనుండి సాయంకాలం ౫ గంటలవరకు మహాత్మగాంధి మౌలానాఆజాదు, నెహ్రూ, వల్లభాయి, భూలాభాయి, కృపలానీ, గఫూరుఖానుగార్లు బిర్లాహౌసులో యిష్టాగోష్ఠి సంభాషణలు జరిపిరి.

### ఖానుబహాదరు అల్లాబక్షుగారు

ఆజాదుగారిఆహ్వానంపై ఖానుబహాదరుఅల్లాబక్షుగారు భారతకాంగ్రెసుసంఘసభలో పాల్గొనడానికి సెప్టంబరు ౧౨వ తేదిమధ్యాహ్నం కరాచీనుంచి బొంబాయికి బయలుదేరిరి.

"సత్యాగ్రహమును ప్రారంభించడానికి భారతకాంగ్రెసుసంఘంవారునూ గాంధిమహాత్ముడున్నూ నిశ్చయించినట్టయితే దానిలో పాల్గొనటకు సరిహద్దురాష్ట్రంలో ప్రజలందరు సంసిద్ధులుగానే వున్నారు. ఎటువంటిత్యాగం చెయ్యవలసివచ్చినా వారు వెనుదీయరు. ఇప్పుడు ప్రభుత్వమువారవలంబించుచున్న పద్ధతివల్ల సత్యాగ్రహముచేయడం తప్పదు" అని డాక్టరుఖానుసాహెబు గారు ఢిల్లీరైలుస్టేషనులో వారిని సందర్శించడానికి వచ్చిన ఢిల్లీకాంగ్రెసువారితో చెప్పిరి.

## ప్రకటన

ఇందుమూలముగా అందరకు తెలియచేయుటయేమనగా "వైదికధర్మ గ్రంథమండలి" కి యింతకు పూర్వము సంపాదకులుగా యుండిన శ్రీ.భూ. రాఘవాచార్యులుగారు పై మండలితో సంబంధము వదలుకొన్నారు. గనుక యికముందు వైదికధర్మ గ్రంథమండలికి సంబంధించిన వ్యవహారమంతయు (మనియార్డర్లు, లేఖలువంపుట) ప్రకాశకుల పేర జరుపుటకై కోరబడుచున్నారు.

ఇట్లు

మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు, ప్రకాశకుడు.

వైదిక ధర్మ గ్రంథ మండలి,

౫౦౧ ఈశీరీ బాగు, సుల్తాన్ బజారు, హైదరాబాదు (దక్కన్).

Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn, Editor- S. Prathapa Reddy, B. A. B. L.